# ఇసుక గోడలు

( నవల )

## ఐతా చంద్రయ్య




జాతీయ సాహిత్య పరిషత్తు
సిద్ధిపేట.

ఇసుక గోడలు (నవల) — ఐతా చంద్రయ్య
జాతీయ సాహిత్య పరిషత్తు — సిద్దిపేట శాఖ.
ప్రచురణ 48.
ప్రథమ ముద్రణ : జనవరి 1995.
ప్రతులు : 1000

వెల: రూ॥ 30/-
ముఖ చిత్రం — గోపి.

ప్రతులకు:
1. ఐతా లింగమూర్తి
ఇంటినెం. 4-4-11 శేర్‌పురా,
సిద్దిపేట-502 103.

4. గాయత్రి పబ్లిషర్స్
ఆంధ్ర సారస్వత పరిషత్తు.
తిలక్‌రోడ్, హైదరాబాద్-500 001

ముద్రణ: శ్రీలక్ష్మి ప్రింటింగ్ ప్రెస్, గాంధీచౌక్, సిద్దిపేట.
కవర్ పేజి: ఓంసాయి గ్రాఫిక్స్,
నారాయణగూడ, హైదరాబాద్:

# ఆశంస.

జాతీయ సాహిత్య పరిషత్తు వెలువరిస్తున్న మొదటి నవల ఈ....ఇసుక గోడలు.

ఇప్పటికే కవిత, కథ, నాటిక, ఏకపాత్ర ప్రక్రియలలో 47 గ్రంథాలు వెలువరించాము. శ్రీ ఐతా చంద్రయ్య కలం నుండి వెలువడిన ఈ గ్రంధము **48** వది.

సాహితీ ప్రక్రియల్లో నవలకు ప్రత్యేక స్థానముందనేది నిర్వివాదాంశం.

తెలుగు పాఠక లోకం మా కృషిని గుర్తించి చల్లని ఆశీస్సులందజేస్తారని ఆశిస్తూ

భవదీయ
చెప్పాల హరినాథశర్మ
ప్రధాన కార్యదర్శి
జాతీయ సాహిత్య పరిషత్తు
సిద్దిపేట.

6–1–1995
శ్రీభవ– పుష్య
శుద్ధ పంచమి.

# నమస్సుమాంజలి.

ఈ " ఇసుక గోడలు నవలను ఆదరించి, అచ్చొత్తించేందుకు ఆర్థిక సహాయమందించిన సిద్ధిపేట ఆయిల్ మిల్లర్స్ అసోసియేషన్ కార్యకర్తలు సర్వశ్రీ తడ్కమడ్ల మురళీధర్, రేనికింది రాజేశం, చొల్లేటి శేఖరం, మురంశెట్టి రాములు మొదలగు మాన్యులకు కృతజ్ఞతలు.

ముఖ చిత్రం వేసిచ్చిన ప్రముఖ చిత్రకారులు శ్రీ గోపి గారికి, దాన్ని అందంగా అచ్చు వేసిచ్చిన ఓం సాయి గ్రాఫిక్స్ అధినేత (హైదరాబాదు) శ్రీ రాంరెడ్డి గారికి ధన్యవాదాలు.

హార్థికంగా సహకరించిన ఆప్త మిత్రులు శ్రీ అయితా బాలరాజేశం ఆప్యాయత నెలా మరువగలను?

వెన్ను దన్నుగా నిలిచిన జాతీయ సాహిత్య పరిషత్తు మిత్రులకు కృతజ్ఞతలు.

పుస్తక ముద్రణను సవాలుగా స్వీకరించిన మిత్రులు శ్రీలక్ష్మి ప్రింటింగ్ ప్రెస్ యజమాని చొప్పదండి రామకోటయ్య గారికి అభినందనలు.

తెలుగు నవలా మాగాణంలో రతనాలు పండించిన నవలా కారులకు నీరాజనాలర్పిస్తూ— ఈ నవలలోని ఎగుడు దిగుడుల గురించి పాఠకుల అభిప్రాయాల నాహ్వానిస్తున్నాను.

—ఐతా చంద్రయ్య

"మీరెంత సేపట్లో వస్తారూ? " ముక్కు పుడక తళుక్కు మంది.

నవగ్రహాల గుడికెళ్ళబోతూ సుధాకర్ కళ్ళలోకి చూచింది సుమతి. ఒక చేతిలో నవధాన్యాలూ, పూజా సామాగ్రితో నిండిన ప్లాస్టిక్ బుట్ట. మరో చేతి వేలు మూడేళ్ళ కొడుకు నవీన్ చేతిలో. ఐదేళ్ళ కూతురు కౌముది కొంగుతో ఆడుకుంటుంది.

నున్నటి భుజాలు, నల్ల గరిక భూమిలా విశాలమైన వక్షస్థలం, గంభీరమైన అడుగులు....పూజా గదిలో కెళ్ళబోతున్న భర్తలో ఏదో సమ్మోహన శక్తి ఉంది. మొహమ్మీది బ్రహ్మ తేజస్సుకు చేతులెత్తి మొక్కాలనిపించింది.

ప్రతి సంవత్సరం అదేరోజు నవగ్రహాల గుడిలో పూజలు చేయించడం ఆనవాయితీ.

దబ్బపండు దేహ ఛాయ, సన్నని ముక్కు, ముక్కును కావలా కాస్తున్న విశాల నేత్రాలు, కనుబొమల మధ్య నుదురు లోంచే పుట్టుకొచ్చినట్టు పావలా కాసంత బొట్టు.... సుధాకర్ చూపులు నిముషం పాటు నిల్చుండి పోయినై. మనో నేత్రాలు భార్య సుమతిలోని పరికొత్త అందాలను స్పృశిస్తున్నాయి. సిగ్గు దొంతరలు సుమతి ఒళ్ళంతా పాకి పద్మరాగాల్లాటి పెదాల మీంచి ముత్యాల్లా మెరిసాయి.

" ఇంట్లో పూజ ముగించి అరగంటలో వస్తాను, మీరు పదండి" అన్నాడు పూజా గదిలో కెల్తూ.

ఆకాశం గుడ్డ మీద అరబోసిన ముత్యాల్లా మెరిసిన చుక్కలు మాయమైపోతున్నా యప్పుడే. సుప్రభాత సూర్యుని నునులేత కిరణాలు భూమాత నుదుటిపై తిలకం దిద్దుతున్నాయి. రోడ్డు కిరుపక్కలా అలవోకగా తలలూపుతున్న చెట్లు కాషాయ పుష్పాలు అలంకరించుకుంటున్నాయి. పిల్లగాలి లయబద్ధంగా కూని రాగాలు తీస్తుంది.

రోడ్డుమీద రాజహంసలా నడుస్తుంది సుమతి.

సంపదలు కలగ్గానే చుట్టుముట్టే చుట్టాల్లా పగలంతా రోడ్డు మీద బహుజన సంచార ముంటుంది. రాత్రికి సద్దుమణిగి ఆస్తంతా పేకాటలో పోగొట్టుకొని పశ్చాత్తాపం చెందుతున్న వాడిలా పడుంటుంది.

నవగ్రహాల గుడి గోపురం స్వాగతం పలుకుతుంది.

" ఆకృష్ణే నరజస వర్తమానోని వేషన్నమృతం మర్త్యంచ
హిరణ్యయేన సవితా రథేన దేవోయాతి భువనాని పశ్యన్"

గుడిలో నిత్యపూజ జరుగుతుంది. గబగబా వెళ్లి పూజా సామాగ్రి గర్భగుడి గడప వద్ద ఉంచింది సుమతి. పిల్లలు ధ్వజస్థంభం చుట్టూ తిరుగుతూ ఆడుకుంటున్నారు.

మంత్రోచ్ఛారణ దివ్యానుభూతినిస్తుంది.

అరగంటలో నిత్యపూజ పూర్తయింది.

"అవ్విలా తేమ్మా" చేతులు చాచాడు పూజారి.

అందించింది.

" అమ్మా.... సుమతమ్మా! " ఉరుములాంటి పిలుపు. గిరుక్కున వెనుదిరిగింది. జడలోని మల్లెదండ నేలరాలింది.

ఇంటిముందటి చిల్లరకొట్టు శ్రీరంగం శతఘ్నిలా దూసుకొచ్చాడు. నోట మాట రాక తటపటాయిస్తున్నాడు. దమ్ము దీస్తున్నాడు.

" ఏమైంది శ్రీరంగం! కొంపలంటుకు పోయినట్టు అట్లా పరుగెత్తడ మెందుకూ?" సుమతికి చిరాకేసింది.

కళ్లు నలుముకొని గట్టిగా ఊపిరి పీల్చి " ఔనమ్మా.... మీ కొంప అంటుకుందమ్మా! మీ ఇల్లు కాలిపోతుంది " గుటకలు మింగుతున్నాడు.

దేవాలయం శిఖరంతో సహా కూలి నెత్తి మీద పడ్డట్టనిపించింది.

బెదరిన లేడిలా పరుగులు తీసింది. తల్లి వెంట పిల్లల పరుగు.

ఇంట్లోంచి పొగలు వస్తున్నై. వీధిలోని జనాలు లోపలి నుండి తీసుకొస్తున్నారు. కొందరు బిందెలతో నీళ్లు కుమ్మరిస్తున్నారు. మంటలు చల్లారాయప్పటికే. ఆతృత నిండిన గుండెలు పూజా గదివైపు నడిపించినై సుమతిని. అడ్డం పొడవు కలిసి ఐదడుగులు మించని చెక్కల పూజా గది చెక్కు చెదరలేదు. అందులోనే పడున్నాడు సుధాకర్.

" ఏమండీ.... ఏమండీ... " గుండె కవాటాల్ని చీల్చుకొచ్చిందా కేక. భర్త ఒళ్లంతా తడిమి తలమీది కొచ్చిన చేతుల నిండా రక్తం. గుండె గుభేల్ మంది.

ఒళ్లు పైపైన కాలివుంది. కమరు వాసనొస్తుంది. ఆరిపోయిన హారతి కర్పూరంలాగైంది సుధాకర్ మొహం.

"ఏమండీ...ఏమండీ.. ఇటు చూడండీ!" ఆవేశం, భయం, ఆందోళన. సుధాకర్ కదలడం లేదు.

సుధాకర్ ముక్కు ముందు వేలుంచి తీసి " అంతా ఐపోయింది. చచ్చిపోయిండు పాపం!" తేల్చేశాడు. శ్రీరంగం.

సుమతి గర్భ కోశంలో బలమైన విద్యుత్తరంగ మొకటి పైకెగిరింది. ప్రళయం చుట్టుముట్టింది. కళ్లు బైర్లు కమ్మినై. వెనక్కు పడిపోయింది.

పొడగాటి కత్తితో పొడిచినట్లనిపించింది శ్రీరంగంకు. తెచ్చి మొహమ్మీద చల్లాడు. మెల్లిగా లేచి కూచుంది.

కష్టమంటే ఏమిటో ఇంతవరకూ తెలీదు. ఇదేమిటీ.... ఒక్కసారే ఇంతపనా? నిజంగా ... నిజంగా చనిపోయాడా తన భర్త.... తన నొంటరిగా వదిలేసి ప్రాణాలొదిలేసాడా?...

పిల్లలు నాన్నా నాన్నా అంటూ దగ్గరికెళ్లారు. తండ్రి మొహం చూచి బెదిరిపోయారు. పక్కకు తప్పుకుని తల్లిని వాటేసుకున్నారు. వచ్చీ పోయే జనాలతో నిండిపోయింది ఇల్లు.

మొహం భయంకరంగా మారింది. ఎలా జరిగిందిది ..... ఎంత సేపట్లో... అంతా అయోమయంగా ఉంది. ఏం చెయ్యా లిప్పుడు? అయ్యో... తన భర్త చనిపోయాడు ... అరగంట క్రితం తననూ, పిల్లల్ని దేవాలయం పంపించిన భర్త చని పోయాడు. భర్తమీద పడి కొట్టు కుంటుంది. గుండెలు బాదు కుంటుంది.

"అన్నా ...అన్నా..."సుగుణాకర్ పరుగెత్తుకొచ్చి సుధాకర్ మీద వాలిపోయాడు.

"అయ్యో...అయ్యో అన్నా! ఎంత పనైందన్నా...ఇంత మంది మున్నా నిన్ను దక్కించుకోలేక పోయామన్నా..." ఊరంతా వినిబడేలా అరుస్తున్నాడు. నెత్తి కొట్టుకుంటున్నాడు- జుట్టు పీక్కుంటున్నాడు.

సుధాకర్ – సుగుణాకర్ అన్నదమ్ములు. ఇద్దరి ఇళ్ల మధ్య కొద్ది ఎడముంది. రెండింటికీ ఒకటే గేటు. ఒకే సందు లోంచి నడవాలిద్దరూ. ఇళ్ల ద్వారాలు ఎదురెదురుగా ఉన్నాయి.

"సుగుణాకర్! నువ్వెక్కడికెళ్ళినావయ్యా?" అడిగారెవరో.

" నేను హనుమంతుని గుడి కెళ్ళాను. హనుమాన్ చాలీసా చదివి వచ్చే సరికీ సంగతి తెలిసింది.... శ్రీరాముడిలాంటి మా సుధాకరన్న ప్రాణాలు తీసింది మా వదినేనండీ....కాల్చి చంపేసింది భగవంతుడా" గుండెలు బాదుకుంటూ లబలబ మంటున్నాడు.

సుమతిమీద పిడుగు పడింది.

సుధాకర్‌ను నరికి పోగులు పెట్టాలన్నంత కోపమొచ్చింది. నిలువునా కంపించిపోతుంది.

అసలేం జరుగుతుంది? నేను నా భర్తను చంపడమా.... సుధాకర్ అరుపుల్లోని అంతర్యమేమిటి? శరీరం మొద్దుబారిపోతుంది. బేలగా చూస్తుంది శవాన్ని.

"మొగుణ్ని చంపి మోక్షం సంపాదించాలని గుడికెళ్ళిందటా.."

అయ్యో వంగనాచిలా కూచుంది—"

"కడుపులో దుఃఖం లేదు, కంటికి ధారల్లేవు" " రాక్షసి నిండు ప్రాణాల్ని పొట్టన బెట్టుకుంది."

నలుగురు నాల్గు రకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు. చెవులు తూట్లు పడుతున్నై. అంతా అయోమయం.

"కాదు.... కాదు.... నాభర్తను నేను చంపుతానా? దశాబ్దంపాటు తోడూ నీడగా నడిచి... నా సర్వస్వమైన భర్తను నేను చంపుకుంటానా?" గట్టిగా అరవాలన్పించింది. ఏదో శక్తి గొంతును నిర్దాక్షిణ్యంగా నొక్కేసింది. ఎద పొంగుతూంది కాని గొంతు పెగలడంలేదు.

"కాలి చచ్చాడంటే ఎవ్వరూ నమ్మరు. తప్పకుండా ఇది హత్యే. కాలి చస్తే కార్డుబోర్డు గది కాలదా? చేతిలోని దేవుని ఫోటో గూడా కాలలేదు." బాగా పరిశీలించిన ముసలావిడ బుగ్గలు నొక్కుకుంది.

" ధర్మరాజులాంటోణ్ని దబుక్కున మింగేశారా " సుధాకర్‌తో పలుసార్లు సహాయం పొందిన ధర్మయ్య కళ్లద్దుకున్నాడు.

# 2

దక్షిణ యాత్రలకు బయల్దేరిన ప్రైవేట్ బస్సు హుందాగా దూసుకుపోతుంది. రాత్రి ప్రయాణం. భోజనాలుచేసి బస్కెక్కారంతా.

రామేశ్వరం సేతు తీర్థంతో కాశీ విశ్వనాథుణ్ని, కాశీ గంగా జలంతో రామేశ్వరం రామలింగేశ్వరుణ్ని అభిషేకిస్తే సంపూర్ణ భారత యాత్రాఫలం దక్కుతుందని సుగుణమ్మకు బాగా తెలుసు. ఇన్నాళ్లు సంసార సాగరంలో మునిగి తేలడంతోనే సరిపోయింది. ఎటూ వెళ్లటానికి వీలు పడలేదు.

పక్కసీటు జానకమ్మతో దోస్తీ కుదిరింది. బస్సు బయల్దేరే ముందు ఏ సీటుమీద కూచుంటే తిరిగొచ్చేదాకా ఆ సీటు సొంతమై పోతుంది. జానకమ్మ—సుగుణమ్మ లిద్దరూ గంగా భాగీరథీ సమానులే. ఇద్దరికీ పక్క పక్క సీట్లు దొరికాయి. బస్సు దిగేప్పుడు ఎక్కేప్పుడు యాత్రిలలో దేవాలయాలు చూచేప్పుడు కలిసే ఉండాలని తీర్మానించుకున్నారు.

కాస్సేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నారు. జానకమ్మకు ఆవలింపులెక్కువై నిద్రలోకి జారుకుంది. కిటికీలోంచి చల్లగాలి దూసుకొచ్చి శరీరానికి హాయినిస్తుంది. నిద్ర రావడంలేదు సుగుణమ్మకు. ముందు చూడబోయే యాత్రా స్థలాల గురించి కాస్సేపు ఊహించుకుంది. నిద్రకోసం మళ్ళీ ప్రయత్నించి విఫలమైంది.

జీవన మైదానంలో ఎన్ని దిక్కుల పరుగులు తీయాలి? అసలీ జీవితం లక్ష్యమేమిటి? ఏమిటో.... జీవన సమరంలో తానెన్ని కుస్తీలు పట్టింది. ఐనా ఏం బావుకుంది? ఏం సాధించింది?

మెదడు పొరల్లో గతం జ్ఞాపకాలు కదలాడుతున్నాయి.

మెగాసిటీ హైదాబాదులో పుట్టి పెరిగిన తాను మారుమూల నున్న కలువలకుంట గ్రామానికి కోడలులా వెళ్లాల్సొస్తుందనుకోలేదు.

సినిమా జీవితానికి అసలు జీవితానికి ఎంత వ్యత్యాసం! అలాంటి జీవితం తానెందుకు గడపొద్దూ? ధైర్యముంటే గడపొచ్చని రెండో పెళ్లివాడితో మూడు ముళ్లు వేయించుకుని ఏడడుగులు నడిచింది. భర్త మొదటి భార్య ఒక కొడుకునీ లోకంలో పడేసి తాను తన లోకానికెళ్లి పోయిందని అంతకుముందే తెలుసు.

పల్లెటూరు వాతావరణం బాగానే తోచింది. మామగారు తన భర్తకప్పగించిన ఎకరం పొలంతో సంసారం గడవాలి. ఎంత రుచి కరమైన వంటకమైనా ఉప్పులేనిదే కుదరదన్నట్లు— ఎంత మంచి పొలమైనా వర్షాలు లేకపోతే నోరు తెరుస్తుంది. తన పెళ్లైన సంవత్స రం లోగా ఒక బావి తోడించారక్కడ. సవతి కొడుకు గంగాధరం ఆలనా పాలనా పెద్ద బరువనిపించలేదు. కాని తన కడుపు పండగానే గంగాధరం గలీజుగాడిలా కన్పించాడు.

కాలచక్రం ఇరవై రెండేళ్లు తిరిగింది.

తనకు ముగ్గురు కొడుకులు ఒక కూతురు. గంగాధరంతో నల్గురు కొడుకులు.

గంగాధరం కరీంనగర్లో రత్నాల వ్యాపారి వద్ద గుమాస్తాగా చేరాడు. అతని పెళ్లైందిగూడా. కరీంనగర్లో కాపురం బెట్టడమంటే ఖర్చుతో కూడుకున్న పని కాబట్టి వారానికోసారి వచ్చిపోతుండేవాడు.

తన కొడుకుల్లో పెద్దవాడు సుధాకర్ — డిగ్రీ పూర్తిచేసి ఉద్యో గాల కప్లికేషన్లు పంపిస్తుంటాడు. రెండోవాడు సుగుణాకర్ డిగ్రీలో చేరాడు. మూడోవాడు వినయ్‌కుమార్ ఎస్సెస్సీ మూడుసార్లు ఫెయిలై ముచ్చటగా వ్యవసాయం పనులు చేస్తున్నాడు. కూతురు నాగమణి పదిహేనేళ్ళదైంది. ఏడో తరగతిలో తప్పి పెద్దమనిషైంది. అంతటితో చదువాగింది.

పట్నానికిరవై కిలోమీటర్లు ఉంటుంది కలువలకుంట. రోజూ ఎంతో మంది పట్నమెళ్ళొస్తుంటారు. భర్త చిన్నదుకాణం గూడా

.రిచాడు. అందులోకొక్కావలసిన సరుకులు పట్నంనుండి తెస్తుంటాడు
ుధాకర్.

సుగుణాకర్ కాలేజిలో విద్యార్థి సంఘం ఎన్నికల్లో పోటీ చేసి
ోలెడంత రాజకీయానుభవం సంపాదించాడు. పరీక్ష హాల్లో కత్తి
ూపించి లెక్చరర్లను హడలెత్తించాడు. డిగ్రీ పరీక్షలు ఐపోగానే
ాలేజీకు టాటా చెప్పాల్సొచ్చింది. కలువలకుంటలో ఖాళీగా తిరగడం
ంలపాణం తోకలోకొస్తుంది.

ఆరోజు రాత్రి.... గంగాధరమొచ్చాడు. అతని చేతులున్న
్రీఫ్ కేసును గారాబంగా లాక్కొని తెరిచిచూచాడు - సుగుణాకర్.
ాన్నిండా కరెన్సీ నోట్ల కట్టలు.... కళ్లు అరచేతులంతైనై. మైకం
కమ్మినంత పనైంది. నోరు తెరుచుకుంది.

"ఇదెంతుంటుందన్నా... ? "

" ఎంతుంటే నీకెందుకురా, వాడు రాగానే నీదో సొద. తెల్లారి
మాట్లాడుకోవచ్చు పద!" మందలించింది తను.

" తమ్ముడేదో సరదాగా అడుగుతున్నాడమ్మా! " గంగాధరం
సుగుణాకర్ వైపు తిరిగి " ఇందులో యాభై వేల రూపాయలున్నా
యిరా! నిన్ననే హైద్రాబాదెళ్ళాను - వడ్డీల వసూళ్ళకు. రేపే ఈ
డబ్బు కరీంనగర్ బ్యాంకులో వెయ్యాలి. ఒక్కోసారి నా వద్ద లక్షల
రూపాయలుంటాయి తెలుసా!" సుగుణాకర్ బుగ్గ గిల్లాడు-గారాబంగా.

అర్ధరాత్రి దాటింది. సుగుణాకర్ తన దగ్గర కొచ్చి " అమ్మా!
అంత డబ్బు నువ్వెప్పుడైనా చూశావా?" నోరెళ్లబెట్టాడు.

"లేదురా.., అవన్నీ నీకెందుకూ? వెళ్లి పడుకో ఫో"

"నేను గూడా చూశ్ళేదు. ఇకముందు చూస్తాననే నమ్మకంగూడా
లేదమ్మా!"

" అది వాళ్ళ సేటు డబ్బురా! ఆ దేభ్యంగాడు అంత డబ్బు సంపాదిస్తాడా? నువ్వెళ్ళి పడుకో ఫో " కసిరింది తను-బంగారంలాంటి నిద్ర పాడుచేస్తున్నాడని.

" ఆ డబ్బు మన సొంతమైతే ఎంత బావుంటుందో " సుగుణాకర్ కళ్ళల్లో ఆశా రేఖ మెరిసింది.

సుధాకరన్నకూ, నీకూ ఉద్యోగాలు దొరికితే అంతకంటే ఎక్కువే సంపాదించవచ్చు ఫో!"

" అదెన్నటికో ఏమో...." మాటాగిపోయింది — బిడియ పడిన పడుచుపిల్లలా.

తన భర్తకు మెలకువొచ్చింది.

"అబ్బా... జరగని సంసారానికి తరగని గుసగుసలన్నట్లు ఏమిట్రా తల్లీ కొడుకుల గుసగుసలూ? నువ్వెళ్ళి పడుకో ఫో .... తెల్లారకముందే గంగాధరన్నను నువ్వే సైకిల్ మీద పట్నం తీసుకెళ్ళి వొదిలిరావాలి తెల్సా." " వ్చ " అంటూ కదిలాడు సుగుణాకర్ — ఏదో పోగొట్టుకున్నవాడిలా.

అనుకున్నట్టు సుగుణాకర్ కోడి కూత సమయంకంటే ముందే లేచి గంగాధరంను సైకిల్‌మీద ఎక్కించుకెళ్లాడు— మళ్ళీ సాయంత్రమొచ్చేశాడు.

పది రోజుల తరువాత కరీంనగర్ నుండి మనిషొచ్చాడు.

"పన్నెండు రోజుల క్రితం డబ్బు వసూళ్ళకు గంగాధరం హైదాబాదువెళ్లి తిరిగి రాలేదు. ఇక్కడ ఉండవచ్చని కనుక్కు రమ్మన్నారు మా సేటుగారు."

"అరె.... పది రోజుల క్రితమే కరీంనగరొచ్చాడు గదా! హైదాబాద్ నుండి తిరుగు ప్రయాణంలో రాత్రికిక్కడ కొచ్చి తెల్లవారే వెళ్ళాడు. వారం రోజులైంది. మా వాడెందుకు రాలే దింకా అని మేం ఎదిరి చూస్తున్నాం. ఇదిగో వీడే—మామూడో

వాడే....గంగాధరంను సైకిల్‌మీద దిగబెట్టాడు పట్నంలో. బస్సెక్కించి వచ్చాడు గూడా. " తన భర్తలో ఆందోళన తొంగి చూచింది.

"కరీంనగర్కైతే రాలేదు. మరెటు వెళ్లుంటాడబ్బా! హైద్రాబాదు ఆసామితో మొన్ననే మా సేటు ఫోన్‌లో మాట్లాడిండు. అక్కడ లేడట. వాళ్లు గంగాధరంకు యాభై వేల రూపాయలిచ్చి పంపారట. డబ్బు అతనివద్దే ఉండి పోయింది." అన్నాడతడు.

"ఇక్కడనుండి పట్నం దాకా క్షేమంగా వెళ్ళినవాడెటు బోతాడబ్బా? కోడలుగూడా ఇక్కడేవుంది.... అత్తారింటికి వెళ్లుండడు." గొణుక్కుంటున్న భర్త కళ్లు ప్రశ్నార్థకాలైనాయి. ఆ తర్వాత అవే కళ్లు అగ్ని గోళాలైనాయి.

" నా కొడుకును మీరే ఏదో చేసుంటారు. ఏం చేశారో చెప్పండి" అందామనుకున్నాడేమో—

మరేమయ్యాడబ్బా—" అన్నాడు శాంతిస్తూ.

తన అంతరాత్మ కీడు శంకించింది.

సుగుణాకర్ మొహం మాడిపోయిన రొట్టె పెంకైంది.

వినయ్‌కుమార్‌ను కొన్ని ఊళ్లు చూసిరమ్మని పంపారు. సుధాకర్ గంగాధరం అత్తారింటికెళ్ళాడు. తన భర్త స్వయంగా హైద్రాబాదెళ్లాడు. జ్వరమొచ్చిందని సుగుణాకర్ ఎటూ పోనన్నాడు. గంగాధరం భార్య ఏడుస్తూ గదిలోనే ఉండిపోయింది.

తన ఎడమకన్ను దిలింది. సుగుణాకర్ మంచం దగ్గరికెళ్ళి

"ఒరేయ్ సుగుణా! గంగాధరన్న ఏమయ్యుంటాడురా?" అడిగింది – మెల్లిగా. పడుకున్నవాడల్లా నేలమీదికి విసిరికొట్టిన బంతిలా లేచి కూచున్నాడు. వడగళ్ళ వానలో తడిసినట్టు వణికి పోతున్నాడు. నుదిటి మీద చెయ్యేసింది. జ్వరమేమీ లేదు.

"ఎందుకూ? ఎందుకలా వణికి పోతున్నావురా?" తనగుండె పీచుపీచుమంది.

"జ్వరం కాదమ్మా—భయమేస్తుంది"

"ఎందుకురా, అంత భయం?"

భయానిక్కారణం చెప్పి పిచ్చివాడిలా చూస్తుండిపోయాడు. తన కళ్ళల్లో జీవం మాయమైంది. ఒళ్ళంతా చెమట పట్టేసింది.

పరిస్థితి అలాగే వుంటే సుగుణాకర్ పిచ్చివాడై పోవచ్చు.. మరింకేమన్నా కావచ్చు. మాతృ హృదయం కొట్టుకులాడింది. ఏదో బలమైన శక్తి తన నరాల్లో సూదిమందులా ప్రవహించి కోపాన్ని మింగేసింది.

సుగుణాకర్ తలను గుమ్మడి పండులా లేపి ఒడిలో వేసుకుంది.

"నువ్వు మగాడివిరా! ఆడపిల్లలా డీలా పడితే ఎలారా? ధైర్యంగా వుండాలి. అయిందేదో ఐపోయింది. ఈ విషయమెవ్వరికీ తెలీదు. తెలువనివ్వద్దు. లే—"

తన మాటలు మందులా పంజేశాయి కాబోలు లేచి కూచున్నాడు. ఓ నిముషం తర్వాత

"గంగాధరన్న దొరకలేదని పోలీసులు నన్ను పట్టుకెళ్ళి మక్కెలిరగదన్ని జైల్లో వేస్తారేమోనే...." మళ్ళీ ఒళ్ళో వాలిపోయాడు. భయం కళ్ళ ద్వారా ధారాపాతమై వర్షిస్తుంది. గుండెల గుబగుబల్ని వెక్కిళ్లు వ్యక్తం చేస్తున్నాయి.

"ఛీఛీ ... మళ్ళీ డీలా పడ్తావెందుకురా! నువ్వేం భయపడకురా— నేమన్నా మగదా అన్నింటికీ" బెదిరించి, బుజ్జగించి నిద్రబుచ్చింది.

గంగాధరం ఆచూకి ఎక్కడా తెలీలేదు. ఒక సంవత్సరం దాకా వెతికి వెతికి వేసారిన గంగాధరం మామ తన కూతుర్ని పుట్టింటికి తీసికెళ్ళాడు.

సుధాకర్ ధారుణ మారణకాండను జీర్ణించుకోలేక బిత్తర చూపులు చూస్తుంది సుమతి. ముందున్నది భర్త శవమని గుర్తొచ్చే సరికి గుండెల్లో కలుక్కుమంటుంది. కాని కళ్ళు మాత్రం నలుగురిముందు వర్షించడం లేదు. అదొక విచిత్రమైన పరిస్థితి.

స్నేహితుడు, దగ్గరి బంధువైన సురేశ్ వచ్చి సుగుణాకర్‌ను పక్కకు తీసికెళ్ళాడు. సురేశ్‌వెంట అతని మిత్రబృందముంది. ఏవేవో సంప్రదింపులు జరిపారు.

సురేశ్ ముందుకొచ్చి "వదినా! నువ్వేం కంగారు పడకు. ఎంత బాధపడినా లాభంలేదు. ఈ సమయంలో ముందేం చెయ్యాలనేదే ఆలోచించాలి. సుధాకరన్నయ్యకి లోకంతో ఋణం తీరిపోయింది. ముందు జరగాల్సింది చూడాలి."నలుగురి ముందు కర్తవ్య బోధ చేశాడు.

పక్కకు తీసికెళ్ళి

"ఇది మామూలు చావుకాదు కాబట్టి పోలీసులకు తెలియాలి. సుగుణాకర్‌కు తెలీక ఏదో వాగాడట. మేమంతా మందలించాం. పోయినవారి వెంట మనమూ పోము. కాని నీ పిల్లల భవిష్యత్తు చూచుకో! ఎవరిమీదా అనుమానం రాకుండా, ఎవరికీ నష్టం జరక్కుండా పోలీసులకు మేము మానేజ్ చేస్తాం. ముందీ కాయితమ్మీద సంతకం చేసివ్వు" తెల్ల కాగితం చేతికిచ్చాడు.

గంగానదిలో కొట్టుకుపోతుంటే గరికపోచ ఆసరా దొరికినట్టైంది.

—నిజమే సుగుణాకర్ వాగిందంతా పోలీసులకు తెలిస్తే నన్ను పట్టుకెళ్తారు. నూతిలో మునుగుతున్న మనిషిమీద నూరు రాళ్లు వేస్తుంది లోకం. సురేశ్ అంతా మానేజ్ చేస్తాడు. వణికే చేతితో తెల్ల కాయితమ్మీద సంతకం చేసిచ్చి

"మరి మా అన్నకు ఫోన్ చేశారా?" అడిగింది.

" మీ అన్నకూ మిగతా బంధువులకు టెలిగ్రాం లిచ్చాం. అంతా వొస్తారు.

సుధాకర్ తోటి ఉద్యోగులొచ్చి అంతిమ దర్శనం చేసుకుంటున్నారు. నిన్నటి వరకూ కలిసి పంజేసిన సుధాకరిక లేడంటూ కంట తడి పెడ్తున్నారు. శవాన్ని చూచి బలమైన అనుమానాలను బహిరంగంగా వ్యక్తం చేస్తున్నారు.

మధ్యాహ్నం ఒంటి గంటకు శవ పంచాయతీ కొచ్చారు పోలీసులు.

అంతకు ముందే సురేశ్ బృందం, పోలీసులనూ పోస్టు మార్టం చెయ్యబోతున్న డాక్టర్‌నూ మచ్చిక చేసుకున్నారు. అంతాకలిసి ఇరవై వేల రూపాయలదాకా ఖర్చయింది.

... ఉదయం ఆరు గంటలకు సుమతి గుడికెళ్ళేప్పుడు సుధాకర్ పూజా గదిలోకెళ్ళాడు. పూజా గదిలోని దీపం పక్కనున్న కిరసనాయిల్ డబ్బా మీద పడింది. డబ్బా బోర్లపడి కిరసనాయిలంతా సుధాకర్‌మీద పడింది. మంటల్లో చిక్కుకుని సుధాకర్ ప్రాణాలొదిలాడు.

శవ పంచాయితీ సారాంశ మది.

శవాన్ని పోస్టు మార్టం చెయ్యాలన్నారు.

ప్రాణానికి ప్రాణమై నిలిచిన పతిదేవుణ్ని.... పది సంవత్సరాలు కలిసి నడిచిన సహచరుణ్ని కోసి కుప్పలేస్తారన్న మాట. అప్పటికే వికారంగా తయారైన శవాన్ని కాకులు, గద్దల్లా పొడుచుకు తింటారన్నమాట.....

సుమతి అంతరంగం దుఃఖ సముద్రమైంది. శవ మ్మీద వాలి గోడుగోడు మంది. పోస్టుమార్టానికి తానొప్పుకోనంది.

" వదినా " కలువకుంట నుండి పరుగెత్తుకొచ్చిన చిన్న మరిది వినయకుమార్ "తప్పదు వదినా! మనమెంత వాదించినా పోలీసులూరుకోరు. అది వాళ్ళ డ్యూటీ. సుధాకర్ని అమృత హృదయుడే. కాని మనకందకుండా వెళ్ళాడు గదా! దయచేసి తే వదినా." బతిమాలాడు_కన్నీటి ధారలనాపుకునే ప్రయత్నం చేస్తూ.

"లేదు వినయ్! మీ అన్నను నరికి పోగులు పెడతారు. పొట్టలోని పేగులు లాగేస్తారు. ఆయనకాగతి వద్దొద్దు....." అందా మనుకుంది మాటలు గొంతులోనే నలిగిపోతున్నై. నలుగురు కానిస్టేబుళ్ళు శవాన్ని తీసికెళ్తున్నారు. రెండు చేతుల్తో తల బాదుకుంది సుమతి. గాజులు ముక్కలై పోతున్నై.

శవం తలకు గాయముంది. రక్తం కారి గడ్డ కట్టుకు పోయిరిది. ముక్కులోంచి కూడా రక్తం కారింది. శవాన్నా క్రమించిన నేల రక్తసిక్తమైంది.

మళ్ళీ సుమతి మెదడు పంజెయ్యలేదు. గుండెలు బాదుకుంటున్నాడు సుగుణాకర్. అతడి భార్య ఊరడిస్తుంది. మరింత కొట్టుకుంటున్నాడు.

వచ్చి పోయే వారు

"పాపం సుగుణాకర్! తోడబుట్టి పెరిగినోడు కదా! అంతటి అన్న మళ్ళీ దొరకడని తట్టుకోలేక పోతున్నా" డన్నారు.

" సుగుణాకర్ను, వినయ్‌కుమార్ను పైకి తెచ్చింది సుధాకరేగదా! అందుకే వాళ్లు ఏడ్చినంత భార్యగూడా ఏడ్వడం లేదు" అన్నారు కొందరు.

ఒళ్ళంతా నూటికి నూరుపాళ్లు కాలి చనిపోయాడని పోస్టుమార్టం రిపోర్టు తయారైంది.

సుమతి ఇంటివద్దనే ఉండిపోయింది. ఆమె దవడలనెవరో నొక్కినట్టనిపించింది. మోకాళ్ళకు తలానించి గోడకొరిగింది. శూన్యంలోకి చూస్తూ గుండెల్ని బిగపట్టుకుంటుంది.

అతుకుల శవం తిరిగొచ్చింది. తన ఉద్యోగి అంత్య క్రియల ఖర్చులకై ప్రభుత్వం రెండు వేల రూపాయలు మంజూరు చేసింది.

డబ్బు పట్టుకొచ్చిన అధికారి సుమతి సంతకం కావాల న్నాడు.

సుమతి ముందుకొచ్చి

"అన్నను సాగనంపేందుకు డబ్బొచ్చింది వదినా" దిక్కులు పిక్కటిల్లేలా అరిచాడు సుగుణాకర్.

"అన్నకిది చివరి జీతమేమో వదినా — అన్న మనకు దూరమైపోతుండూ...." అంటూ వల వల ఏడుస్తున్నాడు,

సుమతిలో సప్తసముద్రాలుపొంగినై. తలబాదుకుంటూ శవమ్మీద ఒరిగిపోయింది.

చూసే వాళ్ళ గుండెలవిసి పోయినై.

సురేశ్ వచ్చి

"వదినా! నేను చెప్పిందంతా మరిచావా? ముందు జరగా ల్సింది జరిగితీరాలి. అసలు నీపిల్లల గురించి ఆలోచిస్తున్నావా? తండ్రిలేని పిల్లల్ని తల్లీ దండ్రీ నువ్వై పెంచాలనే సంగతి మరి చావా? నువ్వూ సుగుణాకర్‌లే ఈఇంటికి దిక్కు ఇహ. మీరిద్దరిలా ఐపోతే ఇంకెట్లా—? మందలించి సంతకం తీసుకున్నాడు.

డబ్బు సుగుణాకర్ చేతికొచ్చింది.

సుమతి అన్న నాగేందరొచ్చే సరికి సాయంత్రం నాలు గైంది. శవాన్ని చూచి బెంబేలెత్తాడు.

హృదయాంతర భావదీప్తుల్ని కళ్లుమూసి తెరిచేలోగా ఆకాశానికెగవేసే శక్తిగల చెల్లెలి కళ్ళల్లో దైన్యం, జాలితనం దోబూచులాడుతున్నాయి. తను కనబడగానే గుండెల నిండా నవ్వుతూ గుండెల మీద వాలిపోయే చెల్లి గుండెలు వగిలేలా, గుంభనంగా రోదిస్తుంది.

సుమతిని ఓదార్చుతుంటే అతనికళ్ళల్లో నీళ్ళూరి ధారలైనై.

విషయాలన్నీ తెలుసుకోవాలనే ప్రయత్నం ఫలించలేదు. అంత్యక్రియలకు శవాన్ని తయారు చేస్తున్నారు. నాగేందర్ భార్య అరుంధతి, తల్లి చెరో వక్క పట్టుకొని నడిపించారు సుమతిని. అందరి వెంట నడవటం తప్ప ఇంకేమీ చేయలేక పోయాడు నాగేందర్.

సుధాకర్ మూడేళ్ళ కొడుకు నవీన్‌ను ముందుంచి అంత్య క్రియలు జరిపిస్తున్నాడు సుగుణాకర్.

"ఈ జన్మలో మననేశక్తి విడదీయలేదు సుమతీ.... రాగ ద్వేషాలు, కోపతాపాలు కలిసి పంచుకుందాం, కష్ట సుఖాలు కలిసి అనుభవిద్దాం." అని తననెన్నోసార్లు లాలించిన సుధాకర్ శరీరం చితి మంటల కాహుతై పోతుంది. సుమతి కడుపులో పేగులు తెగినై. అంతవరకూ ఎండాకాలంలో ఎండిన చెరువుల్లా తడికాని కళ్లు అమాంతం శ్రావణ మేఘాలైనాయి. కాల చక్రం వెనక్కు తిరుగుతున్నట్టూ. ప్రళయం ముంచుకొచ్చినట్టూ, ఆకాశం విరిగి మీద వడినట్టూ....అంతులేని ఆవేదన.

ఆడపిల్లను ఇరవయ్యేళ్లు పెంచి, పెళ్ళి చేసి వంపిన తలి దండ్రుల కంటే పట్టుమని పదేళ్లనా కలిసుండని భర్తతో ఇంతటి అనుబంధమెట్లా ఏర్పడిందో...? ఆశ్చర్యమేసింది నాగేందర్‌కు. 'అదే భారతీయ వివాహ వ్యవస్థలోని గొప్పతనం" జవాబిచ్చింది మనసు.

భూలోక వైకుంఠం తిరుపతి. కొలువుదీరిన తిరుమలేశుని దర్శనం దివ్యానుభూతినిచ్చింది సుగుణమ్మకు. కోనేటి రాయుడి సన్నిధిలో పులకించిన మనసు మయూరమై ఆడింది. అభయ హస్తుని కరుణా వీక్షణం మరోలోకంలోకి తీసుకెళ్ళింది.

తిరుత్తణిలో శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని కటాక్ష వీక్షణం లభించింది. అలంకరించుకున్న గజరాజు—పాప పుణ్యాలను నెమరేసుకొమ్మని తొండమెత్తి గుర్తు చేశాడు. ఆ తర్వాత మద్రాసు కొచ్చేశారు.

మద్రాసులో దినమంతా చూడాల్సినవి చూచి సాయంత్రం గోల్డెన్ బీచ్‌లో ప్రవేశించారు. హృద్యమైన వాతావరణం ఉత్సాహాన్నిచ్చింది. సముద్ర తరంగాలు ఒడ్డుకొచ్చి తల బాదుకుంటుంటే—జీవితంలోని కష్టాలైనా సుఖాలైనా సముద్ర కెరటాల్లాంటివే ననిపించింది. సాగర తీరంలో పెద్దవారు పసిపిల్లలై కేరింతలు కొడుతూ గంతులేస్తున్నారు.

బీచ్‌లో సినిమా షూటింగ్ జరుగుతుంది. కట్, కట్, అక్షన్‌ను కాస్సేపు చూడగానే విసుగొచ్చింది. బస్సు మహాబలిపురం వైపు దూసుకెళ్తుంది.

ఆపద మొక్కులవాడు మనసులో కదలాడి గతంలోకి లాక్కెళ్ళాడు.

రాష్ట్ర ప్రభుత్వోద్యోగం కోసం ఎన్ని ఇంటర్వ్యూల కెళ్ళినా మరీచికల్లాగనిపించినై సుధాకర్‌కు. ఎన్ని వాకిళ్లు తొక్కినా నిష్ఫలమైంది. ఏ ప్రయత్నం లేకుండా – కేవలం అప్లై చేసి కూచుంటే కేంద్ర ప్రభుత్వోద్యోగం దొరికింది. ట్రైనింగ్ పూర్తయిం తర్వాత తమ సొంత పట్నంకే పోస్టింగొచ్చింది. అప్పటికే డిగ్రీ పరీక్షల్ని మూడుసార్లు ఢీ కొట్టి వదిలేశాడు సుగుణాకర్.

సుధాకర్ తన మొదటి నెల జీతం తండ్రి చేతిలో పెడుతూ కళ్యాణ దుర్గాన్ని జయించిన వీర శివాజీలా ఫీలయ్యాడు. తండ్రి కళ్ళల్లో ఆనందబాష్పాలు తళుక్కు మన్నై. కొడుకును ఆప్యాయంగా కౌగలించుకుని

" నా కష్టాలిక గట్టెక్కుతాయిరా సుధా! నన్ను కూచోబెట్టి సాకుతాడనుకున్న గంగాధరం కళ్ళముందు లేకుండా పోయాడు. ఇహ నా బాధ్యతలన్నీ నీ కప్పగించాలనుకుంటున్నా! నా ఆరోగ్యమా రోజు రోజుకు క్షీణిస్తుంది. దరిద్ర దేవత వెంటాడుతూనే వుంది. అది నిన్నేమీ చెయ్యదురా! నా ఆశీస్సులు నీ కెప్పుడూ ఉంటాయి." పొంగి పోతుంటే కనుకొలుకుల్లో దాగలేని ఆనందాశ్రువులు నేలరాలి ముత్యాల్లా మెరిశాయి.

వెయ్యి ఏనుగుల బలమొచ్చింది – సుధాకర్‌కు. తన పాదాలకు నమస్కరించి "ఇహ చెల్లెకు పెళ్లి చేసేద్దామమ్మా...." అన్నాడు.

"ముందు నీ పెళ్ళి కావాలి సుధా! ఆ తర్వాతే చెల్లె పెళ్ళి" అంది తల నిమురుతూ.

ఇదంతా చూస్తున్న సుగుణాకర్‌కు ఒంటి మీద తేళ్లూ జెర్రులూ పాకినట్టనిపించింది. తనకు దక్కాల్సిన కోట్ల రూపాయల ఆస్తినెవరో అమాంతం ఎగరేసుకు పోతున్నట్టనిపించింది. పైకి మాత్రం

" మా సుధాకరన్నకు పెళ్ళయితే మాకు వదినమ్మొస్తుంది. మా వదినను మేమో ఆట పట్టిస్తాం...." అనేశాడు. అరువు దెచ్చుకున్న నవ్వుతో.

నాగమణి అందుకుని

"నేనైతే ఆడ బిడ్డంటే అర్ధమొగుడని వదిన జడ బట్టుకు

లాగుతా— నా మాట వినకుంటే చెవులు మెలేస్తా అఁ! " అంది. గంతులేస్తూ.

ఇల్లంతా నవ్వుల పువ్వులతో కళ కళ లాడింది.

కలువలకుంటకు ఆర్టీసీ బస్సు వేశారప్పుడే. రోజూ ఉదయం పట్నం వెళ్ళి డ్యూటీచేసి సాయంత్రం రావాలంటే కష్టంగా తోచింది—సుధాకర్‌కు. బస్సు రోజుకు రెండే ట్రిప్పులు నడుస్తుంది, తప్పిపోతే సైకిలే గతి.

ఆఫీసు కేమాత్రం ఆలస్యంగా వెళ్ళినా, బెదిరింపులు సంజాయిషీలు తప్పవు. అదే సంగతి చెప్పాడు తండ్రితో.

" ఎందుకొచ్చిన తిప్పలిదంతా! పట్నంలోనే గది అద్దెకు తీసుకో" అన్నాడాయన.

వారం రోజుల్లో గది దొరికింది – పట్నంలో. సుగుణాకర్ ట్యూషన్‌కోసం, వినయ్‌కుమార్ ఇంటర్ చదివేందుకు పట్నంలోనే ఉండిపోయారు.

రోజులు నెలలుగా, నెలలు సంవత్సరాలుగా మారుతున్నాయి. సుగుణాకర్ డిగ్రీ పరీక్షలో మళ్ళీ తప్పాడు. వినయ్ ఇంటర్ ఫైనల్ కొచ్చాడు.

మరో సంవత్సరం తిరిగింది.

నాగమణికి పెళ్ళి కుదిరింది. సుధాకర్‌కు పిల్లనిస్తామని హైదరాబాదు నుండి వచ్చారు.

పెళ్ళి చూపుల్లో సుధాకర్‌కు అమ్మాయి నచ్చింది. పనిలో పని సుధాకర్—నాగమణి పెళ్ళిళ్లు ఒకేరోజు జరిపించారు. ముల్లో కాలు జయించినంత సంతోషమైంది తన భర్తకు.

సుధాకర్ తమ కుటుంబానికి చేస్తున్న సేవల్ని ప్రశంసించారు బంధువులంతా. పథకం ప్రకారం ప్రచారం చేసి ఎన్నికల్లో విజయం సాధించిన అభ్యర్థిలా – గట్టిగా ఊపిరి పీల్చ

కున్నాడతడు. అప్పుల కుప్పలు పెరిగి పోయినా త్వరలో తీర్చ గలననే ఆత్మ విశ్వాసం కలిగింది. భార్యను కలువలకుంట లోనే ఉంచి రోజూ తిరుగుతున్నాడు పట్నానికి.

సినిమాలకూ-షికార్లకూ తిరిగి సుగుణాకర్ డిగ్రీ మూడో సంవత్సరం ఫెయిలయాడు. చిన్నన్ననే ఆదర్శంగా తీసుకొని వినయ్‌కుమార్ ఇంటర్లో అన్ని సబ్జెక్టులు ఫెయిలయాడు.

సెంచరీ సాధిస్తానని పందెం గట్టి, డకౌట్ అయి తిరిగొచ్చిన క్రికెటర్లలా బిక్కమొహాలేశా రిద్దరు.

గడ్డపారతో తలగోక్కున్నట్టయింది సుధాకర్‌కు,

"వెధవల్లారా" తమ్ములిద్దర్నీ నిలోబెట్టి "సిగ్గు లేదట్రా! రోజు కడ్డెడు తింటూ అడ్డ గాడిదల్లా తిరిగారు. ఎన్నిసార్లు మందలించినా పాసై తీరుతామని డంబాలు పలికారు, ఛీ నా శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరు చేశారు గదరా! చీమూ నెత్తురుంటే ఈసారి గట్టిగా చదవండి." మందలించాడు గట్టిగా

అన్నను చంపుకు తిందామన్నంత కోపమొచ్చింది - సుగుణాకర్‌కు. ఒళ్ళంతా కంపరమెత్తి పోతుంది.

"నన్నలా తిట్టే అధికారం నీకెవ్వడిచ్చాడు?" పళ్లు పటపట లాడిస్తై. కాని గొంతు పెగల్లేదు. వీపు విమానం మోత మోగించా లన్పించింది-సుధాకర్‌కు. తమాయించుకున్నాడు.

"తప్పైపోయిందన్నా! క్షమించు. ఈసారి బాగా చదువుతా" వినయ్‌కుమార్‌లో వినయం ఉట్టి పడింది. భాతృ ప్రేమ కరిగి సుధాకర్ కోపాన్ని కరగదీసింది.

విషయం తండ్రికి తెలిసింది. సుగుణాకర్‌ను గట్టిగా మందలించాడు. తండ్రి మీదిగ్గూడా తిరగబడ్డంత పంజేశాడు - చూపుల్తో.

ఆ రోజంతా బాధతో గడిచింది తండ్రికి. రాత్రి సుధాకర్‌తో

"సుగుణాకర్‌నేదో పనిలో ఉంచాలిరా సుధా! వాణ్ని లాగే వదిలేస్తే తెగిపోయిన గాలిపటమై పోతాడురా! అన్నాడు. ఊరికే పరుగెత్తే గుఱ్ఱానికి కళ్లెం వేసి తీరాలనుకున్నాడు సుధాకర్.

కొద్ది రోజులు వెతగ్గా-పట్నంలో బజారుకో ఇల్లు దొరికింది. ముందు దుకాణం వెనక నివాసానికి సౌకర్యంగా వుంది.

సుధాకర్ భార్య సుమతికి పుట్టింటి వారిచ్చిన నగలు తాకట్టు కెళ్లిపోయినై. కిరాణా కొట్టు పెట్టించాడు-సుగుణాకర్‌తో. వ్యాపారం బాగన్పించింది సుగుణాకర్‌కు. సరుకులు తేవడం అమ్మడం-హుషారుగా వుంది. కొన్ని రోజుల్లో కిరాణా కొట్టు జనరల్ షాపుగా ఎదిగింది.

సుమతి పుట్టింటిలో గారాబంగా పెరిగింది. ఒకన్నయ్య ముగ్గురక్కల మధ్య ఇంటర్‌వరకూ చదివింది. పెళ్లెం తర్వాత పల్లెటూర్లో అత్తా -మామ, మరదుల మధ్య కాపురం ఇబ్బందిగా తోచుంటుంది. మొదట కలవర పడినా భర్త పరిష్వంగములో ఆవిడ ఆడతనం చైతన్యం పుంజుకుంది. మొగుడి ముక్కుకు మూగదాడేసి కొంగుకు ముడేసుకు తిరగాలనే తత్వం బలపడింది. నెలలో రెండు సార్లన్నా పట్నమెళ్ళి భర్తతో సినిమా కెళ్ళి వస్తుంది.

అది తనకు ఏ మాత్రం నచ్చలేదు. అనవసరమైన ఖర్చు లతో ఆస్తంతా హారతి కర్పూరంలా కరిగిపోతుంది. ముందు జాగ్రత్త లేకపోతే మూల్గి చావాల్సి వస్తుంది. వయసులో ఉన్న వాళ్ళను అదుపులో పెట్టకపోతే పెద్దవాళ్ళ బాధ్యతా రాహిత్య మౌతుంది.

"ఏమిటమ్మా ఏందుకీ దుబారా! నేనుగూడా హైదరాబాదులో
పుట్టి పెరిగాను. ప్రతినెలా పట్నం వెళ్లి సినిమాలు చూచి తీరాలా?
ఇది సంసారుల లక్షణం కాదమ్మా!" మందలించిందో సారి.

సుమతి మొహం జేవురించింది.

"ఈ మాత్రం మనోరంజనం లేకుంటే ఎలా? ఈ పల్లెటూళ్లో
నూసేందు కేమున్నాయని! మీతరం వేరు, మాతరం వేర
త్తయ్యా! రోజూ పొద్దంతా అడవ చాకిరీ చేస్తున్నాను. అప్పుడ
ప్పుడలా వెళ్ళిరాకపోతే పిచ్చెక్కిపోతుంది." అంది. చేతి మీది
పనాపేసి.

ఇన్నాళ్ళు తన కెదురు నిలిచి మాట్లాడలేదెవ్వరు. కోడలుకు
గుత్తాధికారమా? అరికాలు మంట నెత్తి కెక్కింది.

"చిన్నంతరం పెద్దంతరం లేకుండా ఎమిటా తల బిరుసు
సమాధానం?" కోపం, అధికార దర్పం తొంగిచూచింది తనలో.

"నేనేమన్నా నత్తయ్యా! ఉన్నమాటంటే ఉలుకెందుకూ?
నేనేమన్నా కానిపని చేస్తున్నానా?" చేతిలోని చీపురు కట్ట నేల
కిసిరికొట్టింది.

తన ఆత్మాభిమానాన్నెవరో హత్య చేసినట్టనిపించింది.

"వెధవ్వేశాలు మా ఇంట్లో పనికిరావు. ఒళ్లు దగ్గర బెట్టుకుని
పడుండు"

శనివారం రాత్రి విషయమంతా మొగుడికి చెప్పాంటుంది.
ఆదివారం ఉదయం సుధాకర్

"అమ్మా! ముగ్గురం మగాళ్ళం అక్కడ చేతులు కాల్చు
కోలేక బాధపడ్తున్నాం. రేపు సుమతిని తీసి కెల్తా. ఇల్లు గూడా
సరిపోయేంతగా ఉందక్కడ." అన్నాడు – టీ తాగుతూ.

అత్తా కోడళ్ళ మనస్తత్వాలు ఉత్తర దక్షిణ ధృవాలని
అప్పటికే పసిగట్టిన తన భర్త సుధాకర్ ప్రతిపాదనను చర్చ
లేకుండా ఆమోదించాడు.

అచ్ఛం అజంతా సుందరిలాగుందామె.

ఊటీలో కొత్త జంట. ఆకాశంలో ఆడుకుంటున్న మబ్బు తునకల నందుకోబోతున్న పొడగాటి చెట్లు, రంగు రంగుల పూలు, తీగలు, హృదయ తంత్రుల్ని అలవోకగా మీటే ప్రకృతి సౌందర్యం – యువజంటను ఆనంద డోలికలూగిస్తుంది.

తెల్ల చీర, తెల్ల జాకెట్టు. తలలో తెల్లని మల్లెలు....ఆవిడ నేలమీద నడుస్తూంటే వెన్నెల కదిలి నట్టనిపిస్తుంది. పచ్చని పీతాంబరాలు పరచిన మెత్తని నేల మత్తెక్కిస్తుంది. సమానంగా నడుస్తున్నారు.

అతడు కాస్త వెనక్కు తగ్గి, నడుము కింద నాట్యము చేస్తున్న జడను లాగాడు. అమాంత మతని గుండెలమీద వాలి పోయింది. ఎదురెదురుగా కూచున్నారు.

సోయగాన్నంతా సొంతం జేసుకున్న కనురెప్పలువాల్చి కొంటెగా నవ్వింది. యౌవ్వనంలోని మెరుపు నిగ నిగ లాడే బుగ్గల మీద తళుక్కుమంది.

మనసులోని భావ చిత్రాలను అలవోకగా పలికించగల నేత్రాలతో ఏదో సైగ చేశాడతడు. చెట్టుమీంచి రాలిన పువ్వులా అతని వొడిలో వాలిపోయింది. ఇద్దరి కళ్ళేవేవో మాట్లాడు కుంటు న్నాయి.

ఆవిడ లేచికూచుని అతణ్ని ఒడిలోకి లాక్కుంది. వెల్లకిలా పడుకున్నాడతడు. పొట్టేలు కొమ్ములు తిప్పినట్టున్న క్రాపులోకి ఆవిడవేళ్లు చొచ్చుకు పోతున్నై. మెల్లిగా వంగింది. పెదాలు కలిసినై. నరాలు జివ్వుమన్నై.

పక్కనున్న చెట్టు మీదికెళ్ళింది ఇద్దరి దృష్టి. మంచు బిందువుల్ని ముత్యాల హారాలుగా అలంకరించుకున్నై కొమ్మలు.

" మనల్ని చూచే నవ్వుతుందా తరు - తరణి " యువతి సన్న జాజి ముక్కును మృదువుగా లాగాడు.

" ప్రకృతి పురుషుల మేలు కలయిక చూచి మనసారా నవ్వుతుంది." అతని చెంపల్ని అరచేతులతో రాసింది.

ఆకాశం మేఘావృతమైంది. జల జల మంది వర్షం. జింకల్లా పరుగులు తీస్తూ గది చేరుకుంది జంట. అప్పటికే తడిసి ముద్దలయారు.

గది తలుపులు బిగుసుకు పోయినై. గడియపడిపోయింది. మంచమెక్కి ఒకర్నొకరు రెప్పవాల్చకుండా చూస్తున్నారు.

' తడిచాక నీ అందం ఏన్నోరెట్లు పెరిగింది. భూలోక రంభవై పోయావు." ఆవిడ భుజాలందుకున్నా యతని చేతులు.

"నువ్వు కూడా నలకూబరుడివై పోయావ్" అతణ్ని చుట్టుకు పోతుందామె.

ఒకర్నొకరు అల్లుకుంటున్నారు. ఉచ్ఛ్వాస - నిశ్వాసలు వేడిగా తగుల్తున్నై.

తలుపు మీద టక టక టకలు.

పులుక్కి పడింది సుమతి.

ఇంతవరకూ తను కూచుండే కలగంటుందా.... కాదు— పెళ్లైన సంవత్సరం సుధాకర్‌తో_యల్టీసీ టూర్‌లో— ఊటీలో గడిపిన మధుర క్షణాలు నెమరుకొచ్చినై.

ఐపోయింది. అంతా ఐపోయింది. భవిష్యత్తు ప్రశ్నార్థక మైంది. తాళి ఎగతాళికి గురైంది. వదిన, అమ్మా, అన్నయ్య ఎందరున్నా ఏం లాభం? మండు టెండలో— నిండు ఎడారిలో దారి తెలియక ఒంటరిగా పరుగులు తీసునటుంది

ఏమీ తినాలన్పించడంలేదు. తల్లి బలవంతమ్మీద అన్నం ముద్ద తీసుకుంది. అందులో సుధాకర్ కన్పించి

"నన్నొదిలి — నువ్వొక్కదానివే తింటున్నావుగదూ!" అంటున్నాడు. కడుపులో పేగులు తెగిపోయినై.

నిద్ర కనికరించలేదు. పొరపాటున కునుకు పడితే - సుధాకర్ వెనకనుండి వచ్చి కళ్లు మూస్తున్నాడు.

జాలిగా చూస్తూ "పిల్లల్ని అనాధులు చెయ్యవుగదూ" అంటున్నాడు. కంట తడి పెడుతున్నాడు.

"మానాన్న ఎక్కడమ్మా?" అని పిల్లలు నిలదీస్తే ఏం జెప్పాలి? - పెరిగిం తర్వాత

"మా నాన్న నెవరు చంపారమ్మా"అంటే!....? అవును.... ఏం జెప్పాలి? తనూరికే కూచుంటే నిజం బయట పడదు. పిల్లలు తననే హంతకురాలిగా భావిస్తారు. రాక్షసి కడుపున పుట్టామని జీవితాంతం దెప్పి పొడుస్తారు.

తనూరుకుంటే సుగుణాకర్ ప్రచారం నిజమై కూచుంటుంది. స్త్రీజాతికే కళంకం. చెయ్యని నేరానికి చీడ పురుగుగా మారాలి. వీల్లేదు! "అలా జరగడానికి వీల్లేదు" అంతర్వాణి ఘోషిస్తుంది.

"వదినా..." సుగుణాకరొచ్చాడు- విషణ్ణ వదనంతో. ఊట చెలమలైన కళ్ళకు మసక మసగ్గా కనిపించాడతడు. నలుగురి ముందు—తన కళ్ళల్లో నీళ్ళు రావడం లేదు. ఒంటరి తనంలో ధారలై పోతున్నై. కళ్ళద్దుకుని "రా సుగుణాకర్" అంది.

"అన్నపోయి మూడ్రోజులే ఐనా, జనాలు ముప్పై రకాలుగా కూస్తున్నారు వదినా! నరం లేని నాలుక గదా—"

గుండె కవాటాలు పగిలినై. అరచేతుల్లో మొహం దాచుకుంది.

"అందర్నీ చక్కదిద్దిన అన్న వుండి నేను పోయినా బావుండేది." కూచుండిపోయాడు.

'ఎవరికెప్పుడు రాసిపెట్టుందో అప్పుడు త—ప్ప....దు." దుఃఖ సముద్ర కెరటం గొంతులో ఎగిరింది.

రెండు నిమిషాలు మౌనంగా గడిచినై.

"ఇప్పుడేం చెయ్యాలొదినా?"

"జరగాల్సిందేదో జరిగిపోతుంది గదా! ఇంకా చెయ్యాల్సిందేముందయ్యా?"

"నాకూ-నీకూ అక్రమ సంబంధముందనీ, దాన్ని బయట పెట్టకుండా ఉండేందుకు ఇరవై వేల రూపాయ లీరోజు రాత్రి కాలేజీ వెనకాతలకు తెచ్చివ్వమని గూండా యాదగిరి ఉత్తరం రాశాడిదిగో! ఈ విషయమెవరికన్నా చెబితే ప్రాణాలు తీస్తాడట—." జేబులోంచి కాగితం – తీశాడు.

గోరుచుట్టమీద రోకటి పోటులా ఇదొకటా? ఇలాంటి సమయాల్లోనే ధైర్యంగా ఉండాలి.... లేకపోతే ఏమైనా కావచ్చు!

"ఐతే నన్నేం చెయ్యమంటావ్?"

"ఆ డబ్బేదో నువ్వే సర్దితే గప్చిప్‌గా ఇచ్చొస్తా. వాడు నరరూప రాక్షసుడు. మనిద్దరి ప్రాణాలకు ప్రమాదం!" భయం, మర్యాదలు ధ్వనిస్తున్నాయి మాటల్లో.

"నా దగ్గర డబ్బెక్కడిదీ? గవర్నమెంటిచ్చిన రెండు వేలు గూడా నీ చేతిమీదుగానే ఖర్చౌతున్నాయిగదా!"

సుధాకర్ అంత్యక్రియలైన తర్వాత సుగుణాకర్ గానీ అతని భార్యగానీ ఆవైపుకు రాలేదు.

"అదంతా ఆ రాక్షసుల కేం తెల్సు వదినా?" అన్న దగ్గర చాలా డబ్బుండేది. నీ కన్నీ తెలుసు. ఓ ఇరవై వేల మొహం చూస్తే ." ఇంకేదో అనబోయాడు.

మార్కెట్‌కెళ్ళి కూరగాయలు కొనుక్కొచ్చిన నాగేందర్ "ఇక్కడ కూరగాయల ధరలు ఎక్కువే. హైద్రాబాదే నయం..." అంటూ సుగుణాకర్‌ను చూచి ఆగిపోయాడు. కాయితం గబుక్కున సుగుణాకర్ జేబులోకెళ్ళిపోయింది.

"ఏం చెల్లీ!?... ఏం విశేషం సుగుణాకర్?"

"అబ్బే... ఏంలేదు బావా" వెళ్ళిపోయాడు సుగుణాకర్.

వజవజ వణికిపోతూ విషయం వివరించింది సుమతి. నాగేందర్ వెంటనే సుగుణాకర్ వద్దకెళ్ళాడు.

"ఏదా కాయితం చూద్దాం"

"ఏం కాయితం" నీళ్ళు నమిలాడు సుగుణాకర్.

'అదే గూండా యాదగిరి రాసాడట కదా!"

" గూండా యాదగిరి ఉత్తరమెందుకు రాస్తాడు? " మా అన్నపోయిన షాక్ లోంచే మేమింకా తేరుకోలేదు. మీరేదో విచిత్రంగా మాట్లాడుతున్నారు."

అయోమయంతో తిరిగొచ్చాడు నాగేందర్.

పరిస్థితులెలా పరిణమిస్తాయోనని హడలిపోయింది సుమతి.

"ఎవరేమన్నా... పైన భగవంతుడున్నాడన్నయ్యా!" కుమిలిపోయింది. జాలేసింది నాగేందర్‌కు.

" జరగాల్సిందేదో జరిగి తీరుతుంది. ధైర్యంగా ఉండామ్మా!"

మర్నాడుదయం

" ఈ ముదనష్టం ముండలొచ్చిన్నుంచీ మా కసలు నీళ్ళే దొరకడంలేదు." కుళాయి వద్ద అందరికీ వినబడేలా గొణుక్కుంది సుగుణాకర్ భార్య దేవకి. బావులు వేర్వేరున్నా రెండు పోర్షన్లకు ఒకే కుళాయుంది. బావిలోని ఉప్పునీరు ఇతర పనులకు. కుళాయి నీళ్ళు వంటకు తాగేందుకుపయోగిస్తారు.

నీళ్లు పడుతున్న అరుంధతి కిమ్మనలేదు. ఆరోజు నీళ్లు పట్టడం – అదే మొదటి బిందె.

"పట్టినవి చాలు— ఇక జరుగు" తోసేసింది దేవకి. పడ బోయి నిలదొక్కుకుని

"అయ్యో ఇదేమన్యాయమమ్మా! జరుగుమంటే నేనే జరిగే దాన్ని గదా!" అంటూ లోపలికెళ్ళింది అరుంధతి. ఎవ్వరెంత బతి మాలినా కయ్యానికి కాలుదువ్వెందే కాని – నీళ్లు పట్ట నివ్వలేదు దేవకి. ఉప్పునీళ్ళతోనే సరిపెట్టు కున్నారారోజు.

తదుపరి రోజు మళ్ళీ విశ్వరూపం దాల్చింది దేవకి. ఏం చెయ్యాలో తోచలేదు సుమతి తల్లికి.

సుమతి గుండెలు బిగపట్టుకుని

"మావాళ్ళను గూడా పట్టుకోనివ్వు దేవకీ!" అంది వేడు కోలుగా. దేవకి శివమెత్తింది. క్రోధారుణ నేత్రాలు కొరుక్కు తింటామంటున్నాయి.

"అయ్యో మొగుణ్ని సాగనంపి మూడ్రోజు లైందో లేదో తగాదాకొచ్చావా అక్కా! మొగుడు చచ్చాక కనీసం ముప్పై రోజులన్నా మూలకూర్చుని ఇతరులకు కనబడొద్దని తెలీదా?" హుంకరించింది. ముక్కుపుటా లెగిరి పడుతున్నై.

"బరిదెగించిన వాళ్ళతో నీకెందు కొదినా, నీవని నువు చూసుకో" అంది నాగమణి–దవడలు నొక్కుకుంటూ.

ఆ పూట హోటల్నుండి తెప్పించుకు తిన్నారు. సాయం త్రం సురేశ్ వచ్చాడు. కుళాయి ప్రస్తావన వచ్చింది. దేవకి, అరుంధతి, నాగమణుల్ని సమానంగా మందలించి వెళ్ళాడు. ఆ తర్వాత కుళాయివద్ద గొడవలు రాలేదు.

పదిమందితో కలిసి యాత్రా స్థలాలను దర్శించడం పరమానందంగా ఉంది సుగుణమ్మకు.

మహాబలిపురంలో పల్లవ రాజులు కట్టించిన దేవాలయాలు రాతి రథాలు, రెక్కల గుణ్ణాలు అబ్బుర పరచాయి. తెల్లవారక ముందే సముద్రపు ఒడ్డు చేరి మనోహరమైన సూర్యోదయం తిలకించారు. సముద్రంలోంచి పుట్టుకొచ్చిన సూర్యుడు సముద్రపు అలలకు లేత బంగారు పూతలు పూశాడు.

అక్కడినుండి పాండిచేరి వెళ్ళారు. అరవిందాశ్రమంలో ప్రశాంత వాతావరణం ఆహ్లాదపరిచింది. ధ్యాన సముద్రంలో భక్తుల కౌ్రిసుశిక్షణ-విప్లవ యోగి అరవిందుని భావాలకు అద్దం పడుతుంది. దేశం కోసమే దేహం సుమా! అంటున్నాయక్కడి చెట్లు. యాత్రికులు భోంచేసిన తర్వాత చిదంబరం బయలు దేరింది బస్సు.

చిదంబరం ఈశ్వరాలయం సముద్రానికి చేరువలో ఉంది. సముద్ర కెరటాల గల గలలు గుడి గంటల గణగణలతో తాదాత్మ్యం చెందుతుంటాయి.

ఆదిశక్తిని అర్ధాంగిగా స్వీకరించి తన నాట్య విన్యాసంతో ముజ్జగాల్ని ఓలలాడించిన నటరాజు దర్శనం నవనాడుల్లో ఉత్తేజం నింపింది. అద్భుతమైన శివలింగం, భక్తుల కాశీస్సులందిస్తున్న పార్వతిల ముందు మోకరిల్లారంతా.

ప్రాచీన దేవాలయాలు భారతీయులకు వారసత్వంగా లభించిన అమూల్య సంపదలు. దేశవాసుల హృదయాలను తొంగిస్తాయి. అలనాటి వైభవాలను కళ్ళకు కట్టిస్తూ భవిష్యత్తును బంగారు మయం చేసుకొమ్మని ఉపదేశిస్తున్నాయి.

కుంభకోణం శివాలయం, శివుని హృదయంలా చాలా పెద్దది. విశాలమైన మంటపం, మంటపం నడుమ సజీవ శిల్పాలు మనుషుల్ని మాట్లాడిస్తున్నై.

కుంభకోణం కళాకాంతుల్ని నెమరేసుకుంటూ తంజావూరు పరుగెత్తుంది బస్సు. అలవాటు ప్రకారం జానకమ్మ ఆవలించి నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోయింది.

సుగుణమ్మకు మెదడు పొరల్లో గతం నీలి నీడలు....

భర్త ఆరోగ్యం బాగుపడాలని ఎందరో డాక్టర్లకు చూపించారు. కొడుకులు పట్నం వైపే మొగ్గారు. ఇహ ఊళ్లో ఉండి లాభం లేదని పట్నం వెళ్దామంది తను. చిన్న కొడుకు వినయ కుమారందుకు అంగీకరించలేదు. ముందున్న ఎకరానికి మరో రెండెకరాల పొలం తోడైందప్పటికే–సుధాకర్ చాకచక్యం వల్ల. పొలాన్ని చూచుకుంటూ ఊళ్లోనే ఉండి పోతానన్నాడతడు. అదీ మంచిదే నన్పించింది. వినయ్‌కుమార్ చదువు సంగతి మరిచి పోయాడు. వ్యవసాయమంటే ఆసక్తి చూపిస్తున్నాడు.

తనూ–భర్తా పట్నం మొచ్చేశారు.

కాలం వేగంగా పరుగెత్తుతుంది.

తనకూ–సుమతికి పొయ్యిలో ఉప్పు పోసుకున్నట్టే ఉంది. మాటిమాటికీ తగాదాలొస్తున్నాయి. ఇంట్లో అరుపులూ, కేకలూ వీధి జనాల నాకర్షిస్తున్నై. ఎన్నోసార్లు ఇద్దర్ని మందలించాడు సుధాకర్. పెళ్ళాం బెల్లమైపోయిందా వెధవకి.

చిన్నవారు, పెద్దవారు ఎవరి హద్దుల్లో వారుండి మర్యాద ఇచ్చి పుచ్చుకోవాలంటుంది సుమతి. అత్తగారి కను సైగల్లో కుక్కిన పేనులా పడుండేదే కోడలంటుంది తాను.

ఓసారి... దుకాణంలో పంజేస్తున్న తన భర్త_గాలి దుమారానికి నేల కొరిగిన పున్నాగ చెట్టులా పడిపోయాడు. గిల గిలా కొట్టుకుంటున్నాడు. ఒళ్ళంతా చెమట పట్టింది. రెండు సార్లు వాంతులైనై. చచ్చేంత భయమేసింది. ఆస్పత్రిలో పరీక్షలన్నీ చేసి

" ఇది గుండె జబ్బు_శారీరకంగా, మానసికంగా విశ్రాంతి చాలా అవసరం. ప్రశాంత వాతావరణంలో ఉండాలాయన." అన్నాడు–డాక్టర్. వారం రోజుల్లో మామూలు మనిషైనాడు. "మరోసారి హార్ట్ ఎటాక్ వస్తే ప్రమాద" మని చెబుతూ డిస్చార్జి చేశాడు డాక్టర్.

శ్రావణమాసం వచ్చేసింది. .... ఆరోజు వరలక్ష్మీ వ్రతం మడి గట్టుకుని తను గబగబా పనులు చేసుకుపోతుంది. సుధాకర్ ఆఫీస్ టైమైందన్నాడు.

"మడి వంట తర్వాత చేసుకోవచ్చు. ముందు మీ కొడుక్కి వంట చేస్తానత్తయ్యా!" వంటింట్లో కొచ్చింది సుమతి. అంటే.... దేవుని వంట సగంలో ఆపెయ్యాలన్నమాట. అపచారం జరిగి పోదూ! వీల్లేదంది తను. సుమతి పొయ్యి రాజేస్తూ" మనమింట్లో ఉండే వాళ్ళమే గదా! ముందాయన్ను పంపిద్దాం, కాసింత ఆలస్యమైతే వరలక్ష్మి అమ్మవారేమీ తలదీసి మొలెయ్యదులే " రుసరుస లాడింది.

ఎంత అవమానం! లెంపలు వాయించా లన్పించింది. పిచ్చెక్కినట్టయింది.

"ఇంత పొగరు పనికి రాదమ్మా, నీ హద్దుల్లో నువు చావు. వాడీ పూటకు హోటల్లో తింటాడు" గిన్నెల కడ్డంగా నిల్చుంది తను.

"ఇద్దరాడవాళ్ళ మింట్లో చస్తే_ఆయన హోటల్లో తింటారా?" మడి సామాగ్రిని పక్కకు పెట్టేసి వంట ప్రారంభించింది_సుమతి.

తన కండరాల్ని కొత్త బ్లేడుతో కోసి నిమ్మ రసం పిండి నట్టనిపించింది. పిడికిళ్లు బిగుసుకు పోయినై.

" వెధవముండా! ఎవరిచ్చారే నీకీ అధికారం? " చెయ్యి లేచింది.

"నా చెయ్యి గూడా లేస్తుంది జాగ్రత్త! వెనకటి రోజులు కావివి." సుమతి గుడ్లు దెరిచింది. వళ్లు పట పట లాడినై. అగ్నిలో ఆజ్యం పోసినట్టయింది. సుమతి జడ బట్టి లాగి " ఏమిటే నీ ఆగడం, ఫో ఇక్కణ్నించి " అంటూ చెంప దెబ్బ వేయబోయింది. ఒక్క తోపుతో తను పడబోయి నిలదొక్కుకుంది.

" ఇంత బ్రతుకు బ్రతికి కోడలు చేతిలో పరాభవమా? మనస్సు కుత కుత లాడింది. పడక్కుర్చీలో కూచుండి అంతా వింటున్న తన భర్త వద్దకు పరుగెత్తినై కాళ్లు.

"ఏమండీ.... మీకిది న్యాయంగా తోచిందా?" అప్పటికే అలుముకు పోయిన కన్నీటి తెరల్ని కొంగుతో ఒత్తుకుంది.

పెద్ద మనిషేమీ మాట్లాడలేదు. అతని చూపులు ఇంటి కప్పు మీద. తన గుండెల్లో మంట రాజుకుంది.

"మీరూ, సుధాకర్‌గాడూ ఇద్దరిద్దరే! నోట్లో నాలుకల్లేవు. అది పెట్రేగి పోతుంది." అరుస్తూ చెయ్యి బట్టింది. చెయ్యి చల్లగా తగిలింది, ఒళ్ళంతా తడిమింది. అంతా మంచు ముద్ద. ముక్కుముందు వేలుంచింది. శ్వాస లేదు.

తన గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. పక్కింట్లో వున్న సుధాకర్‌ను పిలిచింది-గాబరాగా. పరుగెత్తి డాక్టర్ని తీసుకొచ్చాడతడు. పరీక్షించి

"అంతా ఐపోయింది." డాక్టర్ నిట్టూర్పు.

అంతే....తన చుట్టూ ఎందరున్నా తానొంటరిదై పోయింది. ఎంత కొట్టుకుంది. మొత్తుకుంది. శతాబ్దాలపాటు తనను నడి

పించిన జీవిత భాగస్వామి తిరిగి రాలేదు. దుఃఖాన్ని దిగమిం గేందుకు కొన్ని నెలలు పట్టింది.

ఓసారి సుధాకర్‌తో అంది తను " సుమతి నోసారి గట్టిగా మందలించు సుధా! భార్య చెడుగైన భర్త తప్పు అంటార్రా!"

" దాందేముందమ్మా! నువ్వే కాస్త సర్దుకు పోతే సరి! ". అన్నాడు–చెవి మీద పేను పారనట్టు. తల తీసేసినంత పనైంది. కళ్లు తడై పోతున్నై.

"అంటే...."

" ఏం లేదమ్మా! నీకెందుకు శ్రమ! హాయిగా ఉండు. పనులన్నీ సుమతే చేస్తుంది. మంచీ, చెడూ అన్నీ చూస్కుం టుంది."

అంటే— నేను .... నా సర్వాధికారాల్ని సుమతికి ధారా దత్తం చేసి ఓమూల పడుండాలన్నమాట! అందుకు తానసలే ఒప్పుకోనంది.

"సుధాకరన్న చాలా మారిపోయాడమ్మా! ఇప్పుడాయన సుమతి భర్తే గాని సుగుణమ్మ కొడుకు గాదు. ఉద్యోగం చేస్తూ పై ఆదాయన్నంతా తన కోసమే కూడబెట్టుకుంటున్నాడు. " అన్నాడు సుగుణాకర్.

" నిజమేరా! చిన్నోడు ఊళ్లోనే ఉండె. నీకో దుకాణం తగిలించాడు. దాంట్లోనే మిగిలించుకుని నాల్గు డబ్బులు వెన కేసుకో–అన్నకు తెలీకుండా." హితోపదేశం చేసింది.

దిగండి డ్రైవర్ అరిచాడు. ఈ లోకంలో కొచ్చిన సుగు ణమ్మ " తంజావూరు వచ్చేసిందా? " అడిగింది – కిటికీలోంచి బయటకు చూస్తూ. రాత్రి.... చీకటి తెరలు దట్టంగా అలుము కున్నాయి. జన సంచారం లేదు. అంతా అడవి. గుండె గుబ గుబ లాడింది. అందరూ దిగుతున్నారు.

"బస్సు చెడిపోయిందట. ఈ రాత్రి ఈ అడవి పాలైనం. ఏమైతుందో ఏమో" జానకమ్మ వణికి పోతుంది.

# 7

ఉద్యోగానికి సెలవు పెట్టేశాడు నాగేందర్. చెల్లి, ఆవిడ పిల్లల భవిష్యత్తు గురించిన ఆలోచనలు కలవరపెట్టేస్తున్నాయి. సుధాకర్‌ది ఆత్మహత్యంటే ఎవరూ నమ్మటం లేదు. తన అంతరాత్మ గూడా అంగీకరించట్లేదు.

చనిపోయి వారం దాటింది. సుధాకర్ బంధువులంతా మూతులు ముడుచుకుని దూరముంటున్నారు. కనీసం పిల్లలనైనా పలుకరించడం లేదెవ్వరూ. సుగుణాకర్ ప్రచారాన్ని నమ్మి-సుమతిని శత్రువుగా చూస్తున్నారు.

సురేశ్ ఇంటికెళ్ళాడు. రేడియో ప్రోగ్రాం రికార్డవుతున్నంత నిశ్శబ్దం పాటించారందరూ. ఎవ్వరూ నోరు విప్పలేదు. అతడే ధైర్యం చేసి

"మా బావది ఆత్మహత్య కాదంటున్నారండీ!" అన్నాడు. సురేశ్ తండ్రి

"పోలీసులతో పేచీ రావద్దని సుగుణాకరూ, మా వాడూ ముందుకొచ్చి, ఆక్సిడెంటుగా రాయించారు. అది ఆత్మహత్య కాదని అందరికీ తెలుసులేవయ్యా" అన్నాడు-అంటీ అంటనట్టుగా.

" నీ చెల్లెలే హంతకురాలు " అన్నట్టు గున్నాయాయన చూపులు.

" మా బావ ఎవరి కన్యాయం చేశాడని హత్యకు గురయ్యుంటాడండీ?"

సురేశ్ తండ్రేదో గట్టిగా మాట్లాడబోయి అణచుకున్నాడు, మరోవైపు మొహం తిప్పాడు.

సురేశ్ తల్లి

"వంగనాచిలా మాట్లాడొద్దు నాయనా! నీ చెల్లెలే చంపిందని అందరికీ తెలిసిపోయిందారోజే. మొగుణ్ని చంపి మొద్దులా చూస్తుందన్నారంతా. ఐనా .... ఆ విషయాలు మాకెందుకులే నాయనా!" అంటూ చక చకా వెళ్ళిపోయింది-లోపలికి.

"ప్లిజ్! ఈ విషయం మా ఇంట్లో తియ్యొద్దండీ!" సురేశ్ మొహం రంగులు మారింది.

"సుగుణాకరేదో పొరపాటుగా వాగాడన్నారు గదండీ!"

"ఏదో అన్నాం, ఏదో చేశాం, సుమతిగ్గూడా నష్టంలేకుండా రాయించాం గదా: మీరేమీ బాధపడకండి." అంటూ బయటకు నడిచాడు.

నాగేందర్ నరాల్లో నిస్సత్తువ తొంగి చూచింది. మస్తిష్కంలో ప్రకంపనాలు. ఆర్నెల్లు హాస్పిటల్లో వైద్యం చేయించుకుని అప్పుడే డిశ్చార్జి అయిన రోగిలా నడుస్తూ ఇంటి దారి పట్టాడు.

తాను నిరుత్సాహ పడితే సుమతి భవిష్యత్తు గందరగోళమౌతుంది. ముందు ముందు దాని పిల్లలే అసహ్యించుకోవచ్చు. ఎలాగైనా సరే... నిజాన్ని బయటకు లాగి-నలుగురికీ తెలియజెయ్యాలి. ఈ ప్రయత్నంలో సుమతి దోషిగా తేలినా వెనకంజ వేసేది లేదు. దోషి శిక్ష అనుభవించి తీరాల్సిందే.

కృత నిశ్చయం కొత్త ఊపిరి నిచ్చింది.

సురేశ్ వాళ్ళింటి కెళ్ళేముందు ఇల్లంతా వెతికాడు. దొరికిన కాయితాలన్నీ పోగు చేశాడు-నాగేందర్. ఏమేమి కాయితాలు ఎక్కడెక్కడున్నాయోనని-షెల్ఫుల్లోని వస్తువుల కింద.... అంతా శోధించాడు. గూటి గడియారం కింద గూడా వెతికాడు. దొరికిన కాయితాలన్నీ ఒకచోట చేర్చి రావాల్సిన బాకీల లిస్టు తయారయ్యేముందు సుమతిని సంప్రదించి వివరాలు కనుక్కున్నాడు.

ఇంటి కొచ్చే సరికి సుగుణాకర్ గొంతు వినబడింది.

"ఇదిగో వదినా: ఈ షెల్ఫులో గూటి గడియారం కింద దొరికింది కాయితం. ఇది అన్న రాతనే" అంటూ కాయితం విప్పాడు. తాను లోలోపల చదివి సుమతి కందించాడు కాయితం నాగేందర్ కందించింది సుమతి-వణికే చేతుల్తో.

సుమతీ! .... నాకు జీవితమ్మీద ఇంకా ఆశలు లేవు. దేవుడు నన్ను పిలుస్తున్నాడు. ప్రపంచములో ఎన్ని ఘన కార్యాలు చేసినా చివరకు మోక్షం కావాలని ప్రతి మనిషి వాంఛి స్తాడు. ఈ విషయంలో ఎవరి స్వార్థం వారిది. భార్యా-పిల్లలు ఎవరూ అడ్డురారీ దారిలో. నిన్నూ పిల్లల్ని విడిచి ఈ లోకం లోంచి వెళ్ళిపోతున్నాను. మీ జీవితాల కొక్కావలసినవన్నీ సమ కూర్చాను. నీకు పెన్షనొస్తుంది. ఇన్స్యూరెన్స్ డబ్బొస్తుంది. సొంతం దుకాణముంది, ఇల్లుంది. నిన్నూ, పిల్లల్ని కంటికి రెప్పలా కాపాడ్తారు నా తమ్ములు.

చివరగా... సుగుణాకర్, నేనూ చెరో యాభై వేలు కలిపి అమ్మకు తీసాం. ఆ డబ్బు సుగుణాకర్ వద్దే వుంది. ఆ మొత్తం డబ్బు అమ్మ ఏం చేసుకుంటుంది? అది సుగుణాకర్ కే చెందా లని నా నిర్ణయం. అందులోంచి నువ్వేమీ అడగకు. నా నిర్ణ యాన్ని అమలుచేసే బాధ్యత నీమీదుంది. నా చావుకు ఎవరూ బాధ్యులు కారు.

ఇట్లు
నీ సుధాకర్

నాగేందర్ కాయితం చదివేలోగా సుగుణాకర్ వెళ్ళి పోయాడు. కొంగు నోట్లో కుక్కుకొని కుమిలిపోతుంది సుమతి. అగాధంలో కొట్టుకుపోతూ ఆశ్రయానికి అర్రులు చాస్తుంది.

గడియారం కింద తాను వెతికాడు. ఏమీ దొరకలేదు. ఇః కాయిత మతని కెలా దొరికింది? ఒకవేళ తను పొరపాటున కాగితాన్ని చూడలేదా!

"ఈ రాత బావదేనా సుమతీ?"

"సుగుణాకర్ రాతకూ, మీ బావగారి రాతకూ పోలిక లుంటూయి. ఇది మీ బావగారి దనిపించటంలేదు. సంతకమైతే ఆయనది కానేకాదు. నాకంతా గందరగోళంగా ఉందన్నయ్యా!" వెక్కి వెక్కి ఏడుస్తుంది. పిల్లలు చెరో వైపు కూచుండి బేలగా చూస్తున్నారు.

"బావగారికి నమ్మకమైన స్నేహితులెవరు?"

"........" వెక్కిళ్లు మాట్లాడనీయలేదు.

"నువ్వే అలాగైపోతే పిల్లలు గుండె చెదిరి పోతారు తెలుసా? వాళ్ళ కొరకన్నా అన్నీ మరిచి ధైర్యంగా ఉండాలి" చేతి గుడ్డతో కళ్ళద్దాడు.

"సురేశ్‌గారు బంధువు... వ్యాపారాల్లో భాగస్వామి గూడా. వాళ్ళాఫీసులో పంజేసే చంద్రశేఖర్‌గారు మీ బావ గారికి ఆప్త మిత్రుడన్నయ్యా!" చంద్రశేఖర్ అడ్రసు చెప్పింది.

## 8

బస్సు ఇంజనుకో తుస్తీ పట్టి మొండికేసిందని ప్రకటించాడు డ్రైవర్—శక్తి వంచన లేకుండా పోరాడి ఓటమి చవిచూచిన సైనికుడిలా.

రాత్రి పద్దైంది. వెంట తెచ్చిన ఫలహారాల మూటలు విప్పుకున్నాయి. యాత్రీకులు రాత్రంతా బస్సులోనే గడిపారు. ఉదయం పక్క టౌను నుండి మెకానిక్ వచ్చి రిపేరు చేసిం తర్వాత కదిలింది బస్సు. పన్నెండు కల్లా తంజావూరు చేరింది.

లాడ్జింగ్‌లో స్నానాదులు ముగించి భోజనాలైం తర్వాత గుడికి బయలుదేరారు.

"ఒకనాడిది భారతీయ కళావైభవాలకు, భోగ భాగ్యాలకు నిలయం. తంజావూరు రాజులు కళాపోషకులు" చెప్పాడు బస్సు ఓనర్ రాజగోపాల్.

చరిత్రకు సాక్షిగా నిలిచిన బృహదేశ్వరాలయం కళా వైచిత్రి అలసటనంతా హరించింది. తంజావూరు పతనంగురించి రాజగోపాల్ కన్నులకు కట్టినట్టు చెప్పాడు. యాత్రీకుల గుండెలు బరువెక్కాయి. తంజావూరు నుండి శ్రీరంగం చేరింది బస్సు.

శ్రీరంగం దేవాలయం చూపించేందుకో గైడును మాట్లాడు కున్నారు.

మేలిమి బంగారు గోపురాలతో శ్రీరంగనాథాలయం దేవ లోకంలా కనబడింది. గోదాదేవి భక్తి పారవశ్యం విశేషాలను విన్పించాడు గైడు. భక్తి శ్రద్ధలతో సాష్టాంగ నమస్కారం చేశారు.

"అందుకే దీన్ని భూలోక వైకుంఠ మంటారు." అన్నాడు చివరికి గైడు. తిరుచ్చి - శ్రీరంగం జంట నగరాలకు వీడ్కో లిస్తుంటే సుగుణమ్మ ఆనందానికి అవధులు లేవు. "పూర్వ జన్మ సుకృతం వల్లనే వీటిని చూడ గల్గుతున్నా"నంది జానకమ్మతో. మూడు గంటలు ప్రయాణించి మధురై చేరుకుంది బస్సు.

" పాండ్య రాజుల రాజధాని మధురై. " రాజగోపాల్ చెబుతున్నాడు. "పరమ శివుడు తన కంఠాభరణమైన నాగరాజు గళం నుండి విషాన్ని తొలగించాడిక్కడే. అప్పుడా నాగరాజు మధురమూర్తయాడు. అందుకే దీనికి మధుర అనే పేరొచ్చింది.

కొండోదరుడనే రాక్షసుని దప్పిక తీర్చేందుకు శివుడు ప్రసాదించిన వేగానది ఒడ్డున కొలువు దీరింది మీనాక్షి అమ్మవారు.

అష్టశక్తి మండపం, మీనాక్షి నాయిక మండపం, మధ్యలో ఖిల్లుల రూపంలో దర్శన మిస్తున్న శివపార్వతుల విగ్రహాలను రెప్ప వాల్చకుండా చూస్తున్నారంతా.

మండపం పశ్చిమ భాగంలో ఒక వెయ్యి ఎనిమిది దీపాల పంక్తి అందరినాకట్టుకుంది. రాత్రి భోజన మక్కడే ముగించి రామేశ్వరం బయలుదేరారు.

సుగుణమ్మ జానకమ్మలు కాస్సేపు మాట్లాడుకున్నారు. ఒకరి కుటుంబ విషయాలింకొకరికి చెప్పుకున్నారు. మాట్లాడే ప్పుడే జానకమ్మ కళ్లు మూతలు పడిపోయాయి.

"ఈవిడ పూర్వజన్మలో కుంభకర్ణుని కూతురయ్యుంటుంది" అనుకుని నవ్వుకుంది–సుగుణమ్మ. కిటికీ బయట చీకటి తాండ విస్తుంది. తల సీటు కొరించగానే మనసు జ్ఞాపకాల పందిట్లో కెళ్ళింది.

ఆరోజు... ఆఫీసు కెల్తున్న సుధాకర్‌తో

"ఆఫీసునుండి కాస్త తొందరగా రా సుధా " అంది తను. సినిమా కెళ్ళాలంటే సుమతి ఆమాటే చెబుతుండేది.

"ఎందుకమ్మా" ఆగిపోయాడు.

"మన సుగుణాకర్ పెళ్ళి ఖాయం చేసుకోవాలి. సాయం త్రం వాళ్ళొస్తున్నారు. ఈరోజు మంచిరోజు గదా, తాంబూలాలు పుచ్చుకోవాలి"

గందరగోళం కథను బాక్సాఫీసుకోసం మరింత అగమ్య గోచరంగా తయారు చేసిన సినీ డైరెక్టరై పోయాడు–సుధాకర్. సుమతి కనుబొమ్మలు ఆర్చిలై పోయినై.

" సుగుణాకర్ పెళ్ళా? అమ్మాయెవరు? ఎప్పుడు? ఎవరు చూశారు... ఏం మాట్లాడారు" ప్రశ్నల వర్షం కురిసింది.

"..మనూరమ్మాయేరా! రైస్‌మిల్ గోవిందయ్య కూతురు. ఈ ఊళ్ళోనే స్థిర పడ్డారుగదా: అమ్మాయి బావుంది. చదువుకుంది. మొన్న నేనూ సుగుణాకర్ నవగ్రహాల గుడి కెళ్ళి రాంగా గోవిందయ్య కనబడి వాళ్ళింటికి తీసి కెళ్ళాడు. అమ్మాయిని చూపించారు. నీ తమ్మునికి నచ్చింది." చెప్పింది తను. తెరవెనుక ఏదో జరిగిపోయిందని సుధాకర్ కనుమాన మొచ్చిందో లేదో గాని గడుసు పిల్ల సుమతి అట్టే వసిగట్టింది.

"ఎలుకా ఎలుకా నీ పెత్తనమెంత వరకేంటే బొక్కదాకా అందిట. వాళ్లు నచ్చిన కోడలు వచ్చేస్తుంది - మధ్య మీరెవరండీ?" దీర్ఘాలు తీసింది.

సాయంత్రం తాంబూలా లందుతున్నారు. సుమతికి సీమంతమైం తర్వాత – సుగుణాకర్ పెళ్ళి జరిగింది. సుగుణాకర్ భార్య దేవకి అణకువ గలది. తన చెప్పుచేతల్లో మెదిలి తీరుతుందనే విశ్వాసం కలిగింది.

సుమతి కూతురుకు జన్మ నిచ్చింది. బారసాల బ్రహ్మాండంగా జరిగింది.

సుధాకర్ తనను ఏ పనులూ చెయ్యొద్దంటాడు. దేవాలయానికి, హరి కథలకు వెళ్ళమంటాడు. కృష్ణా రామా అంటూ గడిపెయ్యమంటున్నాడు.

" ఇప్పుడే అస్త్ర సన్యాసం చెయ్యడం నా కిష్టం లేదు. " ఖచ్చితంగా చెప్పేసింది. దుకాణంలో పంజేస్తూ సుగుణాకర్‌కు చేదోడు వాదోడైంది. దుకాణం గిరాకీ ఉదయం, సాయంత్రం బావుంటుంది. వారం రోజులకని తెచ్చిన సరుకులు మూడు ఐపోతున్నై. లాభాలు చాలా ఎక్కువే వస్తున్నై.

ఉదయం సాయంత్రం సుధాకర్‌కు సమయం చిక్కుతుంది. సుగుణాకర్ పేర చిట్టీల వ్యాపారం నడిపిస్తున్నాడు. లెఖ్ఖలన్నీ సుగుణాకరే చూస్తున్నా-చిట్టిలో సభ్యులను చేర్పించడం, డబ్బు వసూలు చేసివ్వడం సుధాకర్ వంతైంది.

"సంపాదనంతా ఏనాటికైనా అన్నదమ్ములం పంచుకుంటాంగదా" అన్నాడోసారి సుధాకర్-సుమతి అనుమానాలను కొట్టి పారేస్తూ.

డబ్బు తానే సమకూర్చి వినయ్‌కుమార్ చేత మరింత పొలం కొనిపించాడు-ఊళ్ళో.

ఎవ్వరికీ తెలీకుండా మెయిన్ రోడ్డులో వంద గజాల ఖాళీ స్థలం కొనేశాడు-సుగుణాకర్. ఆ సంగతి వారం రోజుల్లో సుధాకర్‌కు తెలిసిపోయింది. మనసనే మందారాన్ని బూటు కాలితో నలిపేసి నట్టనిపించిందేమో

"ఏన్గు తోలు తెచ్చి ఎన్నాళ్లు ఉతికినా నలుపు నలుపేకాని తెలుపు కాదు. ఇంటికి మీరెన్ని సేవలు చేసినా చివరికి మీకు మిగిలేది కుచ్చుల టోపీయే... ఇప్పుడైనా కళ్లు తెరచి ఎవరి దారి వారు చూసుకోవడం మంచిది" ఎద్దేవా చేసి సలహా ఇచ్చింది సుమతి.

తాను సుగుణాకర్‌ను మందలించింది. ఎందుకంటే తనకు చెప్పి ఆ స్థలం కొన్నాడు సుగుణాకర్. ఆ సంగతి సుధాకర్‌కు తెలిస్తే ఠావుండదాయె. ఆ స్థలం పక్కనే మరో వంద గజాల స్థలముంది. అది సుధాకర్ కొనేశాడు. రెండు పోర్షన్ల ఇండ్లు, ఒకోక్క పోర్షనుకానుకుని రోడ్డుకొక్కో దుకాణం కట్టేశారు. వ్యాపారానికనువైన స్థలమది.

కొత్త ఇంట్లో గృహ ప్రవేశం చేసిం తర్వాత సుమతికి పుత్రోదయమైంది. ఆ రోజు తన అంతరాళాల్లో అసూయలాంటి

దేదో తలెత్తింది. ఉద్యోగం చేస్తూ బోల్డెంత సంపాదిస్తున్న సుధాకర్‌కు కొడుకు పుట్టాడు. నాకూ, సుగుణాకర్‌కూ తెలీకుండా ఇంకే వ్యాపారం చేస్తున్నాడో ఏమో....!

పసివాడి బోసి నవ్వుల్లో కరిగిపోతూ–నందరాజుల నోడిం చిన చాణక్యుడిలా పొంగిపోతున్నాడు సుధాకర్. సుమతిలో మాతృప్రేమ పొంగింది. కళ్ళల్లో ఆశాదీపాలు వెలిగాయి. సుగుణాకర్ కెందుకో ఒళ్ళంతా మండిపోయింది.

కొత్తింట్లో ఒక దుకాణంలో సుగుణాకర్ జనరల్ అండ్ కిరాణా స్టోరు నడుస్తుంది. మరోటి బట్టల దుకాణం. ఆఫీసు కెళ్ళే దాకా, ఆఫీసునుండి వచ్చిం తర్వాత బట్టల కొట్లో సుధాకరుం టాడు. మిగతా సమయాల్లో సుమతి ఉంటుంది. రెండు దుకాణాలు మేన్‌రోడ్డు మీదుండడం చేత గిరాకీ ప్రోత్సాహకరంగా ఉంటుంది.

నెలకో, రెండు నెలలకోసారి సెలవు పెట్టి సుధాకర్ హైద్రాబాద్ వెళ్ళి బట్టలు కొనుక్కొచ్చి ధర వరలు సుమతికి, గుమాస్తాకు చెప్పేస్తాడు.

డబ్బు బాగానే ఉంటుందని రెండు ఫైనాన్స్ కార్పొరేషన్లలో షేర్లు కొనేశారు. వడ్డీ వ్యాపారం గూడా నడుస్తుంది – సుగుణాకర్ పేర. లెఖ్ఖలన్నీ సుగుణాకరే చూస్తున్నాడు.

సురేశ్ మానేజర్‌గా పంజేస్తున్న మరో రెండు ఫైనాన్స్ కంపెనీల్లో భాగస్వాములయారు. అప్పట్నుంచి సురేశ్-సుగుణాకర్‌లు మరింత దగ్గరయారు. సుధాకర్‌కు తెలీకుండా సురేశ్‌కు కొంత డబ్బందుతుంది. ఇద్దరూ కలిసి ప్రతి ఆదివారం పిక్నిక్‌లకూ, బార్‌లకూ వెల్తున్నారు. సుధాకర్‌కు కొన్ని విషయాలు తెలిసినా చూసీ చూడనట్టుంటున్నాడు.

"రోమ్ నగరం తగలడి పోతుంటే ఫిడేల్ వాయించిన నీరో చక్రవర్తిలాగుంటే భవిష్యత్తేమైపోతుందో ఆలోచించారా? మేలుకోవాలి బాబూ" అంటూ పోరు పెడుతుంది సుమతి. తన కంతా వినబడుతుంది.

"సుగుణాకర్ నేనూ ఒకే రక్తం పంచుకుపుట్టాం సుమతీ! మన కన్యాయం జరగదు. ఎందుకంటే మా అమ్మ ఉంది గదా పెద్ద దిక్కు." అంటూ సుమతిని మందలించాడు.

సురేశ్ కొత్తగా ప్రారంభించిన మోడరన్ కోళ్ళ ఫారం చూడాలన్పించి వెళ్ళాడక్కడికి సుధాకర్ – సాధ్యాసాధ్యాలు కనుక్కొని తమ్ముడూ, తాను కలిసి మరోటి ప్రారంభించాలని.

సాదక బాధకాలన్నీ వివరించి, ఫారం చూపించి_ఇప్పుడే వస్తానని ఎటో వెళ్ళాడట సురేశ్.

ఆఫీసు గుమాస్తాను

"మేముగూడా ఇలాంటిదే ప్రారంభిస్తే ఎలాఉంటుంది?" అడిగాడు సుధాకర్.

"ఇందులోగూడా మీకు సగభాగముందిగదా! ఇదిగాక మరోటి ప్రారంభిస్తారా?"

"ఇందులో మా భాగముందని ఎవరన్నారోయ్?" గుండెల మీద పెద్ద భారాన్ని మోపినట్టయినా బయటపడలేదట. సుధాకర్‌ను అనుమానంగా చూస్తూ.

"ఎవరు చెప్పడమేమిటి సార్! సురేష్, సుగుణాకర్ గార లిద్దరు కలిసి చెరో లక్ష రూపాయలు పెట్టుబడి పెట్టి గదా దీన్ని ప్రారంభించింది. మీ అమ్మగారు వచ్చి వెళ్ళారిక్కడికి. నాకు తెలీదనుకుంటున్నారా సార్" నవ్వేశాడట.

"నీకేమీ తెలీదురా వెఱ్ఱి వెంగళప్పా!" అన్నట్టుందట గుమాస్తా ధోరణి.

అసమర్థుడైన వైద్యునితో వైద్యం చేయించుకుని చావు బతుకుల్లో చిక్కుకున్న రోగిలాగయ్యాడట సుధాకర్.

"నిజమే.... నువు చెప్పిందంతా నిజమేనోయ్" అందామను కుని "గుమాస్తాతో నాకేం పని" అన్పించూరుకున్నాడట.

టీలు పట్టించుకొచ్చిన సురేశ్‌తో

"సార్ దీంట్లో సుధాకర్‌గారు గూడా భాగస్వామి గదా! ఇదిగాక మరో ఫారం ప్రారంభిస్తారట" అన్నాడట. తాజా వార్త పత్రిక కందిస్తున్న కొత్త విలేఖరిలా నవ్వుతూ.

ఆ నవ్వు సుధాకర్‌ను కుత కుత లాడించిందట.

"ఔనా సుధాకర్.... ఐతే దాంట్లోగూడా నా పేరుంటుంది సుమా!" టీ గ్లాసందించాడట సురేశ్.

అగాధం ఒడ్డున నిల్చొండి కిందకు చూస్తున్న బాలుడిలా "మీరిది ప్రారంభిస్తున్నారని నాకు తెలీదు. నువ్వు గానీ, సుగుణాకర్ గానీ, అమ్మగానీ ఎవ్వరూ చెప్పలేదు." టీ గ్లాసు పెదాల కానించుకున్నాడట.

సురేష్ మోహం రంగులు మారిందట. ఏదో గుర్తు కొచ్చి నట్టు"ఇది నా ఒక్కనిదే. ఎవరి పొత్తు లేదిందులో. ఈ విషయంలో నేనెవ్వరినీ సంప్రదించలేదు." అనేశాడట. గుమాస్తా అయో మయంలో ఇరుక్కున్నాడట.

"సురేష్ మనం బంధువులమే కాకుండా మంచి స్నేహితు లము గూడా. నువ్వు నా కబద్ధం చెబుతావనుకోలేదు."

"దయచేసి ఈ విషయంలో నన్నింకేమీ అడగొద్దన్నా!" సుధాకర్ చేతులు పట్టుకున్నాడు సురేశ్.

సుధాకర్ ఇంటివద్ద అంతా తనకు చెప్పేశాడు. సుగుణా కర్‌ను నిలదీశాడు.

అందులో నా పొత్తేమీ లేదు. నీకు తెలీకుండా నేనెట్లా భాగస్వామినౌతానన్నా? మనిద్దరి మధ్య ద్వేషం రగిల్చేందుకు ఎవరో నీకబద్ధం చెప్పుంటారు." చేతులు కట్టుకు నిల్చున్నాడు-సుగుణాకర్-అపర లక్ష్మణుడిలా.

"సురేష్ రమ్మంటే వెళ్ళి చూసొనంతే" చల్లగా తప్పుకుంది తను.

సుమతి పోరాటంలో న్యాయ ముందనిపించవచ్చు-సుధాకర్‌కు.

"కొడుకులందరం నీకు సమానమే కదమ్మా! దృష్టి భేదం ధర్మం కాదమ్మా!" సుధాకర్ కళ్ళల్లో నీటి తెరలు. మాటల్లో అసహ్యం, అవిశ్వాసం ప్రకటితమౌతున్నాయి.

తనకు ఒళ్లు మండింది. వీడు నాకు తెలీకుండా ఎంతో సంపాదించుకుంటున్నాడని సుధాకరో వైపు చెబుతూనే వున్నాడు. వీడేమో చెప్పడు. ఏమన్నా అడిగితే " భగవంతుని సాక్షిగా నీకు తెలీని సంపాదన నాకేమి లేదమ్మా" అంటాడు-నంగనాచిలా. తన తడాఖా చూపించి తీరాలనుకుంది.

పెద్ద శబ్దంతో బస్సాగింది. మూల్గుతూ లేస్తున్నారు తోటి యాత్రికులు.

"రామేశ్వర మొచ్చాం దిగండి" అరిచాడు రాజగోపాల్.

ఆటో రిక్షాలు చేసుకొని లాడ్జింగు కెళ్ళేసరికి రాత్రి పన్నెండైంది. ఉదయం ధనుష్కోటికి చేరారు. " ధనుష్కోటినే సేతు వంటారు" రాజగోపాల్ ముందుకొచ్చి స్థల మహాత్మ్యం చెబుతున్నాడు. "ఈ మహోదధి అంటే బంగాళా ఖాతము, రత్నాకరము అంటే హిందు మహా సముద్రము, పుణ్య సంగమములో స్నాన మాచరిస్తుంటే అతి ప్రాచీన వైభవోపేతమైన భారత చరిత్రాంశాలు మనసులో మెదుల్తాయి.

శ్రీరాముడు రావణ సంహారానికై లంక చేరేందుకు ఇక్కడే సముద్రం మీద వారధి నిర్మించాడు. రావణ సంహారం తర్వాత సీతాదేవితో రామేశ్వరం వచ్చాడు. రావణుడు నిష్టా గరిష్ఠుడు, శివ భక్తుడు, బ్రాహ్మణుడు, ఒకే దుర్గుణంతో వినాశం కొని తెచ్చుకున్నాడు. బ్రహ్మ హత్యా పాప నివారణ కోసం శ్రీరాముడు పరమ శివుణ్ని పూజింప దలిచాడు. అంజనేయుడు శివలింగం తెచ్చేందుకు కైలాసం వెళ్ళాడు. ఆలస్యాన్ని భరించ లేక సీతామాత ఇసుక లింగం తయారు చేసింది. ఆ సాధ్వీమణి కరస్పర్శతో ఇసుక లింగం గట్టిబడింది. కైలాసమునుండి శివ లింగము తెచ్చిన ఆంజనేయునికి కోపమొచ్చింది. అప్పుడు శ్రీరాముడు "ముందు హనుమంతుడు తెచ్చిన లింగమూర్తిని పూజించిన తర్వాతనే ఇసుక లింగాన్ని పూజస్తారని శాంత పరిచాడు. రెండు లింగ మూర్తులు ప్రతిష్ఠించబడినై."

చెప్పడం పూర్తిచేసి స్నానానికి తయారయాడు రాజ గోపాల్. యాత్రికులు అతన్ననుసరించారు.

ప్రసిద్ధ జ్యోతిర్లింగమైన రామేశ్వరంలో పిండ ప్రదానం చేస్తే పితరులు పుణ్య లోకాలకు చేరుకుంటారని ప్రతీతి. పిండ ప్రదానం చేస్తున్న భక్తుల్ని తిలకిస్తూ స్నానం పూర్తి చేసింది సుగుణమ్మ. జానకమ్మతో కలిసి రామలింగేశ్వరాలయంలో ప్రవేశించింది. ఆలయ ప్రాంగణములో ఇద్దరూ కలిసి ఇరవై రెండు తీర్థాలలో తల స్నానం చేసి రామలింగేశ్వర దర్శనానికి క్యూలో నిల్చున్నారు.

రామలింగేశ్వరుని దర్శనంతో మనసులోని బాధలన్నీ తాత్కాలికంగా మరుగున పడిపోయినై. చైతన్య స్రవంతి నరాలను తట్టిలేపింది. అభిషేకాన్ని కన్నార్పకుండా చూసి ఆనంద డోలికలూగారు.

సింహళ ప్రభువు పరాక్రమ బాహు. పన్నెండవ శతాబ్దంలో అతడు నిర్మించిన గుడిలోని సువిశాల మండపాలు కళాకాంతు లీనుతూ ఆసక్తి రేకెత్తించాయి.

తదేకంగా చూస్తూ మైమరచిన సుగుణమ్మ బాహ్య ప్రపంచములో కొచ్చేసరికి తోటి యాత్రికులెవ్వరూ కనబడలేదు. కంగారుగా వెదికిందటూ, ఇటూ ఎవ్వరూ కనబడలేదు. గుండె గుబ గుబ లాడింది.

ఎవ్వరి నడగాలి? ఎటు బోవాలి? అక్కడివారికి తెలుగు రాదు, తనకు తమిళం రాదు. ఎరగని ఊళ్లో మొరగని కుక్కైపోయింది.

# 9

నమస్కారమండీ!"

కొత్తగా కనబడిన వ్యక్తిలో ఆత్మీత కనిపించింది—చంద్రశేఖర్‌కు. లోపలికాహ్వానించాడు.

"నాపేరు నాగేందర్. చనిపోయిన సుధాకర్ మా బావ. హైద్రాబాదులో ప్రభుత్వోద్యోగం చేస్తున్నాను."

"ఐతే... మీరు సుమతి అన్నగారన్నమాట"

మిత్రుడు సుధాకర్ మెదడు పొరల్లో మెదిలాడు.

" సుధాకర్ ధారుణ మరణం మమ్మల్ని కృంగదీసిందండీ! అది ఆత్మహత్యంటే మా ఉద్యోగులెవరూ నమ్మడంలేదు" నాగేందర్‌కు టీ అందింది.

" మాకదే అనుమానం. కాని .... ఈ రహస్యాన్ని ఎలా ఛేదించాలో.... ఎలా ప్రొసీడ్ కావాలో తెలీడం లేదండీ! వాతావరణం పూర్తిగా ప్రతికూలంగా ఉంది. మీరేమైనా సహకరిస్తారనీ...." నాగేందర్ మాటల్లో ఆవేదన, అభ్యర్థన మిళితమైంది.

"తప్పకుండా నేను చేయుగలిగినదంతా చేస్తాను."

కాయితం చంద్రశేఖర్ కిచ్చి

"ఇది మాబావగారి రాతేనా .... మీరు గుర్తుపట్టగలరా?" అడిగాడు ఆదుర్దాగా.

కాయితం చదవగానే చంద్రశేఖర్‌కు ఊపిరి ఆగినంత పనైంది.

"ఇది సుధాకర్ రాతకాదు. సంతకం గూడా అతనిదికాదు. సుగుణాకర్ రాతనే అయివుంటుంది. ఇదెక్కడ దొరికిందండీ?" కనుబొమ్మలు ముడివడినై.

జరిగిన సంగతి చెప్పేశాడు నాగేందర్.

చాలాసేపు మాట్లాడుకున్నారు. అమెరికాలో ఆంధ్రుడు దొరికినంత తృప్తినిచ్చింది నాగేందర్‌కు. డిపార్టుమెంటు నుండి పెన్షన్, గ్రాట్యుటీలు త్వరగా మంజూరయ్యేట్టు చూస్తానని హామీ యిచ్చాడు చంద్రశేఖర్.

"మీరు హైదరాబాదులో ఉంటున్నారు గదా!" తనకు తోచిన విషయం చెప్పాలని "పోలీస్ డిపార్టుమెంటులో పెద్దాఫీస రెవరినైనా కలిసి కేసు సక్రమ మార్గంలో నడిచేలా ప్రయత్నించండి. దోషులకు శిక్షపడితే సుధాకర్ ఆత్మకు శాంతి లభిస్తుంది. అంతేకాదు.... నోటికొచ్చినట్టు కూస్తూ సుమతి మీద నిందలు వేసేవారి నోళ్లు మూతలు పడాలి." అన్నాడు.

"ఆ పని తప్పకుండా చేస్తా—అన్నాడే కాని నాగేందర్‌ను మరో అనుమానం పీడిస్తుంది. "స్థానిక దిన పత్రిక అది ఆత్మ హత్యంటూ పోలీసుల కథనం ప్రకారం వార్తలు రాశాయిగదా! దాన్ని మనమెలా మార్పించగలం?"

"కేసును తిరగదోడితే పోలీసులే తిరిగి పత్రికా ప్రకటన లిస్తారు. నిజమేమిటో తేటతెల్లమౌతుంది. మీరు న్యాయం కోసం ప్రయత్నిస్తున్నారు. అన్యాయం ఎంత వెర్రితలలేసినా చివరికి

జయించేది న్యాయమేగదా!" చంద్రశేఖర్ మాటలు స్ఫూర్తి నిస్తున్నై. నాగేందర్‌లో ఆత్మ విశ్వాసం ఊపిరి పోసుకుంది.

# 10

ఎడారిలో ఒయాసిస్సులా కన్పించిన తెలుగు పూజారి సహాయంతో బస్సు దగ్గరికొచ్చింది సుగుణమ్మ. గట్టిగా ఊపిరి పీల్చుకుని బస్సెక్కింది. నన్నొందుకొదిలేశావని జానకమ్మను నిలదీసింది. "నువు నాకంటే ముందుగొచ్చావనుకుని నేనొచ్చా" నంది ఆవిడ. యాత్రా బస్సు కన్యాకుమారి చేరింది. దేశ విదేశాల నుండి వచ్చిన వేలాది మంది సముద్రపు ఒడ్డు చేరుకొని అతిమనోహరమైన సూర్యోదయం, సూర్యాస్తమయ దృష్యాలను కనువిందు చేసుకున్నారు. కెమెరాలు క్లిక్కుమన్నాయి.

భారతీయ ధర్మాలను, తత్వ సంపదను ప్రపంచ దేశాల్లో చాటి చెప్పిన యుగ పురుషుడు వివేకానందుని స్మృతి చిహ్నానికి లాంచీల్లో వెళ్ళారు. ఎత్తయిన కొండమీద మూడు సముద్రాల మధ్య సనాతన వారసత్వాన్ని, సంస్కృతీ సాంప్రదాయాలను గుర్తుచేస్తుంది. మనం విడిపోతే పడిపోతామని ఏకాత్మతా మంత్రం నినదిస్తుంది. స్మృతి చిహ్నం అగ్రభాగంలో రెప రెప లాడుతున్న ఓంకార ధ్వజం పూర్వవైభవ పునరుద్ధరణకు అందరూ నడుం బిగించాలని చిరునవ్వులు చిందిస్తూ ఆదేశిస్తుంది. చూసే వారి గుండెలు గర్వంతో ఉప్పొంగాయి.

అపర భగీరథుడు ఏకనాథ రాణడే సముద్రాన్నిది కొండను చేరగలిగాడు. అంతటి అపురూపమైన స్మృతి చిహ్న నిర్మాణానికి త్రికరణ శుద్ధిగా సాహసోపేతంగా శ్రమించాడు. అతని కార్య కౌశలం ఆశ్చర్యంలో ముంచెత్తింది. స్వామి వివేకానంద తపస్సు చేసిన స్థానంలో ధ్యాన మందిర ముంది.

ధ్యాన మందిరములో ఎదురుగా ఓంకారం. దాని మీదే దృష్టి నిలిపి బాహ్య ప్రపంచాన్ని మరిచారు. ప్రకృతి ఒడిలో పారవశ్యం.

ఒడ్డుకు తిరిగివచ్చి కన్యాకుమారి దేవాలయాని కెళ్ళారు. కటిక చీకటిలో తన ముక్కు పుడకతో స్వయం ప్రకాశాన్ని సృష్టించుకుంటున్న కన్యాకుమారి విచిత్రమైన అనుభూతి నిచ్చింది.

అక్కడ బస్సెక్కి త్రివేంద్రం చేరుకున్నారు. పద్మనాభ స్వామి దర్శనం జీవితం ఒక పరమపద సోపాన పఠమని గుర్తు చేసింది. ఎంత చేసినా చివరకు మిగిలే దేమిటన్నది. బస్సు గురువయ్యూరుకు బయలుదేరింది. సుగుణమ్మను గతం జ్ఞాప కాలు ముసురు కుంటున్నాయి.

గంగాధరం భార్యకు రెండో పెళ్ళి చేస్తున్నామని— ఆవిడ తండ్రి ఉత్తరం రాశాడు.

"ఇదేమి న్యాయం?" అంది బుగ్గలు నొక్కుకుంటూ.

"అన్యాయమేముందమ్మా! " సుధాకర్ తన సహజ ధోరణిలో "గంగాధరన్న కోసం ఇన్నాళ్లు వేచి చూచింది. ఇంత వరకు ఆచూకీ తెలియలేదు. తన కూతురు సౌభాగ్యవతిగా సర్వ సుఖాలనుభవించాలని కన్న కడుపు ఆరాటపడుతుంది గదా! ఆవిడ మరో పెళ్ళి చేసుకోవడం న్యాయమే!" సమర్థించాడు.

నిజానికి ఆమె కోరుకుందదే.

"మరి పెళ్ళిలో మనం వదినకు పెట్టిన బంగారు నగల సంగతేమిటి?" తన సొమ్ములెవరో దోచుకు పోతున్నట్టనిపించిన సుగుణాకర్ " కనీసం వాటి విలువ ఇరవై వేల రూపాయ లౌతుంది." అన్నాడు.

" నిజమే కాని....వాళ్ళిచ్చిన ఇరవై ఐదు వేల రూపాయల కట్నంగూడా మనం తిరిగివ్వాలిగదా! " గుర్తు చేశాడు సుధాకర్,

మర్నాడే సుగుణాకర్ కూతురు నామకరణోత్సవం. అందుకొరకొచ్చిన వినయకుమార్

"అదంతా ఎందుకూ? మనం నగలడిగితే వాళ్ళు డబ్బు లడుగుతారు. ఇచ్చుకోవడం, పుచ్చుకోవడాలు పక్కకు బెట్టి ఆవిడకు హాయిగా పెళ్ళి జరిపించండని ఉత్తరం రాయి సుధాకరన్నా " తీర్మానించాడు.

నామకరణం తెల్లవారి వినయకుమార్ కలువలకుంట కెళ్ళేందుకు తయారౌతున్నాడు. కలువలకుంటలోని పక్కింటి శంకరయ్య తన కూతురు వసంతతో ప్రత్యక్ష మయాడు.

" రా శంకరయ్యా... క్షేమమేనా? " ఆహ్వానించాడు సుధాకర్.

" వసంత పెళ్ళి కెదిగినట్టుందే సంబంధాలేమైనా చూస్తున్నావా?" అడిగింది తను.

వినయకుమార్ వాలకం ఇనుప తెరల మధ్య ఇరికించినట్టుంది. మొహం కళావిహీనమైంది.

ఒంపు సొంపులన్నీ ఒద్దికగా అమర్చివున్న వసంత నొసట ముంగురులు అందమైన కళ్ళకడ్డంగా ముసురుకుంటున్నాయి. నేల చూపులు చూస్తుంటే నున్నటి చెక్కిళ్లు తళుక్కు మన్నాయి.

"కూర్చో వసంతా.. ఏమిటి విశేషాలు?" అడిగాడు సుధాకర్.

కంటిలోని నీటి పొరలు కరగకుండా జాగ్రత్త పడుతూ అరుగుమీద కూచుంది వసంత.

"ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తోచడం లేదు బాబూ " శంకరయ్య గొంతులో జీర.

"ఏం ఏమైంది?" తన భృకుటి ముడి పడింది.

" నా పరువూ మర్యాద లిప్పుడు మీ చేతుల్లో ఉన్నా యమ్మా!" తన కాళ్ళ మీద వాలిపోయాడు శంకరయ్య.

అంతటితో ఆగకుండా సుధాకర్ చేతులు పట్టుకొని.... ఇవి చేతులు కావనుకో....నా కూతురు కన్యాయం చెయ్యొద్దుబాబూ!" అంటూంటే అతని కళ్ళల్లో నీరు చిప్పిల్లింది.

" అసలేం జరిగిందో చెప్పకుండా, ఇదంతా ఏమిటి? " సుధాకర్ కేమీ అర్థం గాలేదు.

"మీ తమ్ముడు వినయకుమార్ నా కూతురు వసంతతో చాటుగా దోస్తీ చేశాడట. పెళ్ళి చేసుకుందామని మనూరి ఎల్లమ్మ పాదాలు కొట్టి ప్రమాణం చేసుకున్నారట. అమాయకురాలు.... ఇప్పుడది తల్లి కాబోతుంది.

కణ కణ మండే ఇనుప కమ్మీలతో వీపు మీద చరిచి నట్ట యింది సుధాకర్కు. అతని చూపులు వినయ్కుమార్ వైపు మళ్ళాయి.

" అదేం లేదు పెద్దన్నా! అయ్యో.... నేనే దొరికానా... " వణికి పోతున్నాడు వినయ్. తన నరాల నెవరో పీకి కుప్ప వేసి నట్టనిపించింది.

" మా వాడలాంటి వాడు కాదు. పిచ్చి వేషా లెయ్యకు శంకరయ్యా!"

" ఆడపిల్లకు పెళ్ళి చెయ్యలేకగాక వెట్టి వేషాలు...." గుడ్లెఱ్ఱ జేశాడు—సుగుణాకర్.

మూర్తీభవించిన దైన్య దేవతయింది, వసంత. ఆమె కళ్ళల్లో నిజాయితీ, నిశ్చలత్వం గోచరిస్తున్నాయి.

సుమతి - దేవకి లు ప్రేక్షకులై పోయారు.

అగాధం ఒడ్డున నిల్చొంది ఆకాశంవైపు చూస్తున్నట్టున్న శంకరయ్య మరోసారి తన కాళ్ళను చుట్టేసి - తానబద్ధమాడ్డం లేదన్నాడు.

"ఏమ్మా?" వసంత నడిగాడు సుధాకర్ "నువ్వేం పసి పిల్లవు కాదుగదా! మీ నాన్న చెప్పిందంతా నిజమేనా? నువ్వే మన్నా తప్పు చేసుంటే చెప్పు, మాచేతనైన సాయం చేస్తాం కాని మావాడి ననవసరంగా లాగొద్దు."

వసంత తలెత్తింది. ఆ మొహంలో అప్పుడే వికసించిన పద్మంలోని అరుణారిమ, బంగారంలోని పసిమిదనం ఇమిడ న్నాయి. నల్ల కలువల్లాంటి కళ్లు వర్షిస్తున్నాయి. కన్నీటితో తడిసిన చెక్కిళ్ళు మంచులో తడిసిన మందార పూలైనాయి. మాట్లాడేందుకు ధైర్యం కూడగట్టుకుని

"నిజమేనండీ! మా నాన్న చెప్పిందంతా నిజం. పెళ్లి కాకముందే మీ తమ్ముడితో హద్దులు మీరడం నేంజేసిన తప్పు... మొన్న మీతమ్ముడిక్కడికి వచ్చేముందు - ఈ విషయమంతా మీకు చెప్పమన్నాను. వెంటనే పెళ్ళికి ఏర్పాట్లు చేయించ మన్నాన్నూ. ఆయనేమో నీకూ-నాకు ఎలాంటి సంబంధం లేదు. నువ్వెవ్వడితో తిరిగావో ఛీ అన్నాడు. నా కన్యాయం చెయ్యొద్దని కాళ్ళావేళ్ళా పడి బతిమాలాను.

"నాకు లక్ష రూపాయల కట్నమిచ్చి పిల్ల నిస్తారు. మీనాన్న ఇవ్వగలడా?" అనడిగాడు. వెంటనే వెళ్ళి మా అమ్మా నాన్నలకు చెప్పాను సంగతంతా!" అంది గువ్వలా ఒదిగి కూచుంటూ.

తనూ-సుధాకర్ వినయ్‌కుమార్ను లోపలికి తీసికెళ్ళి నిజ మేమిటో చెప్పమన్నారు. జవాబియ్యలేదు వినయ్. లెంపలు వాయించి అడిగాడు సుధాకర్.

శంకరయ్య చెప్పిందంతా నిజమేనని ఒప్పుకున్నాడు.

"ఆ కట్నమేదో ఇస్తే ఆ పిల్లనే చేసుకుందా"మంది తను.

"ఏరోజు కారోజు సంపాదించుకొని పొట్టబోసుకుంటున్న వాడు కట్నమేమిస్తాడు? అంతగా కట్నం కావాలనుకున్నవాడు ఆ పిల్ల తెరువెందుకు పోవాలి?" నిలదీశాడు సుధాకర్. అందర్నీ ఒప్పించాడు గూడా.

వసంత ఎర్రని పెదాల మధ్య తెల్లని ముత్యంలా మెరిసింది నవ్వు. మొహం గులాబీలా మెరిసి గుప్పున విచ్చుకుంది. వెంటనే తనపాదాలు స్పృశించి ఆశీస్సులందుకుంది. శంకరయ్య వెనకా ముందాలోచించకుండా సుధాకర్ కాళ్ళకు మొక్కాడు. సుధాకర్ వద్దని వారించినా వినలేదు.

వసంత–వినయ్‌కుమార్‌లకు గుళ్లో పెళ్ళయింది.

"అసలు కట్నమే లేకుండా ఒప్పుకున్నాడెందుకో సుధాకర్!" అంది తను సుగుణాకర్‌తో.

"చాటు కేమన్నా వసూలు చేసుకుంటాడేమో" అన్నాడు సుగుణాకర్.

ఇంటి పనుల్లో దేవకి ఏమాత్రం సహాయం చెయ్యడం లేదంటుంది సుమతి.

"అక్కయ్య దొరసానిలా కూచుండి అన్ని పనులు నాకే పురమాయిస్తుంది" అంటుంది దేవకి.

తోటి కోడళ్ళకసలే పడదం లేదు. ఏ చిన్న గొడవ జరిగినా తన అన్నయ్యకు చేరవేస్తుంది దేవకి. ఆయన పరుగెత్తుకొచ్చి దూం దాం అంటాడు. ఇల్లు పీకి పందిరేసినంత పంజేస్తాడు.

"దేవకి చిన్నదిగదా! అదేంజేసినా చెయ్యక పోయినా చూసీ చూడనట్టుంటే మంచిది." అంది తనోసారి సుమతితో.

"తోటి కోడలు చిన్నదైతే పాలు చిన్నదా! ఆస్తి పంప కంలో తక్కువ పంచుకుంటుందా? నేనే ఇద్దరు పిల్లల్తో వేగలేక ఛస్తున్నాను. దాని కొక్కతే నలుసాయె. పైగా మీ కొడుకు ఆఫీసు కెళ్ళిం తర్వాత బట్టల కొట్టు చూసుకోవాలి గదా!" ధుమ ధుమలాడింది సుమతి. తన కోపం నశాకానికంటింది.

"అప్పుడే ఆస్తి పంపకాలకు దిగావన్నమాట. ఇంతగర్వం పనికిరాదమ్మా"

"వందేళ్ళు బతికినా చావు తప్పదు. వెయ్యేళ్ళు కలిసున్నా వేరు తప్పదన్నారు గదా!" అవాక్కైంది తను.

మర్నాడు రాత్రి సుధాకర్, సుగుణాకర్‌ను కూచో బెట్టి చిట్టీలు, వ్యాపారాల లెక్క అడిగాడు. ఆరు కిలోల ఆముదం తాగినవాడిలాగైపోయాడు సుగుణాకర్.

"చిట్టీలు సరిగా వసూలు కాలేదు. ఎత్తుకున్న వాళ్ళు ఎగ్గొ ట్టారు. కిరాణా షాపులో బోలెడు ఉద్దెర పద్దులు. చాలా నష్టమైం దన్నా!" తల నేలకు వేలాడేశాడు.

"అదేం కుదరదు. లెఖ్ఖలన్నీ క్షుణ్ణంగా చూడాల్సిందే." సుధాకర్ పట్టుబట్టాడు. సుగుణాకర్ తల చటుక్కున లేచింది.

"అంటే.... నేనేమన్నా ఉద్యోగం చేస్తూ చాటు వ్యాపా రాలు చేస్తున్నానా?" ఆ దెప్పి పొడుపు సుధాకర్ గుండెల్లో శరాఘాత మయ్యింటుంది.

"పిచ్చి వేషాలెయ్యద్దు"

"నాకు పిచ్చి పట్టలేదింకా!"

పరిస్థితి భయానకంగా తయారౌతుంది. చిలికి చిలికి గాలి వానయేట్టుంది. వీళ్ళిద్దరూ కొట్టుకుంటే కుటుంబం పరువు దుమ్ము గొట్టుకు పోతుంది. అప్పటికే సుగుణాకర్ బోలెడంత డబ్బు వెన కేసుకున్నాడని తనకు తెలుసు.

"ఒరేయ్ సుధా॰ తను కల్పించుకుంది. "ఎన్నాళ్లు కలిసున్నా అన్నదమ్ములు ఆస్తులు పంచుకోక తప్పదని నిన్ననే నీ పెళ్ళామందిరా. మీలో ద్వేష భావాలు ముదరక ముందే ఎవరి దారి వారు చూసోక్కండి." అంది—ఇహ తప్పదని తెలిసి.

వెంటనే చెరో పోర్షన్లో సామాన్లు సర్దుకున్నారు. బట్టలషాపు పక్క పోర్షన్ సుధాకర్, కిరాణా/జనరల్ షాపు పక్క పోర్షన్ సుగుణాకర్ ఎన్నుకున్నారు.

కలువల కుంట నుండి వినయకుమార్‌ను పిలిపించారు.

"కలువలకుంట ఆస్తి అన్నలకు పంచివ్వను. ఇక్కడి ఆస్తి నేనడగను." తేల్చేశాడతడు. సరేనన్నారంతా.

తను సుగుణాకర్ వద్ద ఉంటానంది. అందుగ్గాను సుధాకర్ - సుగుణాకర్ చెరో యాభై వేల రూపాయలు తన కివ్వాలని గూడా నిర్ణయమైంది.

దుకాణం, వడ్డీ వ్యాపారం, చిట్టీల లెఖ్కలు సరిగా చూపాలని పట్టు బట్టాడు సుధాకర్. అంతా నష్టమేనని మొరాయించాడు. సుగుణాకర్. బట్టల దుకాణం లెఖ్కలు ముందే చూపించాడు సుధాకర్.

"చిట్టీల్లో లక్షకు పైగా లాభం రావాలి" నిలదీశాడు సుధాకర్ "దుకాణంలో ముప్పై వేలకు పైగా రావాలి. వడ్డీ వ్యాపారంలో మరో యాభై వేలు లాభం వచ్చింది. నా కంతా తెలుసు."

చిట్టీలు ఎత్తుకొని ఎగ్గొట్టిన వారి పేర్లు చెప్పమంటే ముగ్గురి పేర్లు చెప్పాడు సుగుణాకర్, వాళ్ళతో సుధాకర్ సంప్రదించాడు. కోపంతో ఊగిపోతూ సుగుణాకర్ ముందుకొచ్చి . తమ లెక్కలు తీసి చూపుమన్నారు-వారు.

లెడ్జర్ పోస్టింగ్‌లు సరిగా ఉన్నాయి. వాళ్ళ వద్ద రసీదు లున్నాయి. సుగుణాకర్ మాట – అబద్దాల మూటని తేలి పోయింది.

సుధాకర్ ముందే –ఒకాయన సుగుణాకర్‌కు యాభై వేల రూపాయలూ, వడ్డీ ఇచ్చి

“ మీ బాకీ తీరింది. నా కాయిత మివ్వ ” మన్నాడు. కాయితం ఇవ్వగానే వెళ్ళిపోయాడు.

“ ఈ పద్దు లెఖ్ఖల్లో చూపలేదు గదా! ” నోరు దెరిచాడు సుధాకర్. సుగుణాకర్ నీళ్లు నమిలాడు. బ్యాంకు దొంగతనంలో పట్టుబడ్డ దొంగలాగై పోయాడు.

“ఇదొక్కటి మరిచానన్నా! ఐనా....నీకుద్యోగముందిగదా ఇందులోంచి నీకు చిల్లిగవ్వ పంచివ్వను. ఏం జేస్తావో చేస్కో” తెగించాడు.

కోపంతో సుధాకర్ కళ్లు ఎర్రబడి పోతున్నై. మరోవైపు ఆరాటం– “ తమ్ముడు సుగుణాకరేనా అలా మాట్లాడింది. నా చేతుల మీదుగా బాగుపడిన వాడేనా ఎదురుతిరిగింది? ” గొణు కున్నాడు.

తనుగూడా సుగుణాకర్‌నే సమర్థించింది.

“ఐతే చెరొక ఇద్దరు పెద్దమనుషుల్ని తీసుకొచ్చి పంచా యితి కూర్చుందాం, తేలిపోద్ది” అన్నాడు సుధాకర్ – ఆవేశా న్నంతా అణచుకొని.

సరేనన్నాడు సుగుణాకర్.

“నీ బుద్ధి భూమితో పాతర బెట్టావురా వెధవా! నలుగురి ముందు కూచుంటే లెఖ్ఖలన్నీ చూపించుమంటారు. వ్యాపారాల పుట్టు పూర్వోత్తరాలు వ్రాస్తావిస్తారు. కుటుంబం ఎవరివల్ల తెల్ల బడింది,.....ఇవన్నీ ఆలోచించి నీ బండారం బయట పడేస్తారు,

లెఖ్ఖలన్నీ సరిగ్గా తెలితే నువ్వే సుధాకరన్నకు రెండు లక్షల దాకా ఇవ్వాల్సుంటుంది." సుగుణాకర్‌ను మందలించింది తను.

అరవయ్యేళ్ళు రాత్రింబవళ్లు కష్టించి సంపాదించిన ఆస్తిని అర నిమిషంలో పోగొట్టుకున్న వాడిలాగయాడు సుగుణాకర్. చెమటతో గుడ్డలు ముద్దయి పోతున్నై. చేతులు పిసుక్కుంటూ

"పొరపాటై పోయిందమ్మా! మరిప్పుడెలా? నువ్వే ఏదో ఉపాయం చెప్పమ్మా!" ప్రాధేయపడ్డాడు.

"మీ మామనూ, వినయ్‌కుమార్‌ను అన్న దగ్గరికి తీసి కెళ్ళు. క్షమించుమని కాళ్లు పట్టుకో. ఆ యాభై వేల నుండి ఇరవై వేలిస్తానని ఒప్పుకో... ఇదంతా నలుగురి ముందు కెళ్ళకముందే జరిగిపోవాలి" తరుణోయం ఉపదేశమైంది.

సుగుణాకర్ అన్నంత పంజేశాడు. సుధాకర్ ఆశ్చర్యాని కంతులేదు. సుగుణాకర్ మామ, వినయ్‌కుమార్‌లు నచ్చ జెప్పారు సుదాకిర్‌కు. " తప్పైందన్నాడు కాబట్టి ఇరవై వేల కొప్పు" కొమ్మన్నారు. సరే ననక తప్పలేదు.

లోలోపల సుగుణాకర్ గుండెలు భగ్గుమంటున్నాయి.

" దిగవమ్మా సుగుణమ్మా.... " సుగుణమ్మ భుజాలు పట్టి కుదిపింది జానకమ్మ.

వర్తమానాని కొచ్చి సామానులు చేత బట్టింది,

లాడ్జింగ్‌లో స్నానాదులు ముగించి గురువయ్యూర్ శ్రీకృష్ణ దేవాలయానికి బయలుదేరారు - యాత్రీకులు. గురువయ్యూర్ స్థల మహాత్మ్యం వివరిస్తున్నాడు రా జగోపాల్.

"తక్షకునిపై పగ తీర్చుకునేందుకు జనమేజయుడు ప్రారంభించిన సర్పయాగంలో సర్ప జాతి చాలా వరకు యజ్ఞ కుండములో పడి నశించింది. అగ్ని కాహుతయేందుకు తక్షకుని వంతు

వచ్చింది. తక్షకుడు ఇంద్రుని శరణు జొచ్చాడు. ఇంద్రుడు బృహస్పతిని ప్రార్థించి జనమేజయుని వద్దకు పంపించాడు.

బృహస్పతి జనమేజయునితో

" ఓ రాజా! తక్షకుడు అమృతం రుచి చూచాడు కాబట్టి చావడానికి వీల్లేదు. అతడు మీ తండ్రి పరీక్షిత్తును కాటేసి చంపిన మాట వాస్తవమే కాని అది కర్మ ఫలితం మాత్రమే. తక్షకు డొక సాధనం. కర్మ ఫలాన్ని ఎవ్వరూ తప్పించలేరు కాబట్టి యజ్ఞాన్ని ఆపు." హితవు చెప్పాడు.

పశ్చాత్తాపంతో కుమిలిపోయి యజ్ఞాన్నాపాడు జనమేజేయుడు. కాని ఘోరకృత్యానికి ఫలితంగా జనమేజయునికి కుష్టువ్యాధి సోకింది. మంటలు పోట్లతో అల్లాడి పోతున్నాడు. ఒకరోజు అత్రిమహర్షి దర్శనం లభించిందతనికి. తరుణోపాయం చెప్పమని ప్రార్థించగా అత్రి మహర్షి – "గురువయ్యూరు వెళ్ళి అక్కడ వెలసిన కృష్ణమూర్తిని వేడుకో" మ్మన్నాడు. అక్కడి స్వామిని భక్తి ప్రపత్తులతో సేవిస్తే భక్తుల కోర్కెలన్నీ తీరి మోక్షప్రాప్తి లభిస్తుందని మార్గ దర్శనం చేశాడు.

"గురువయ్యూరు గురించి మరింత వివరంగా చెప్పండి" అని ప్రార్థించాడు జనమజేయుడు. అతని ఆసక్తికి తృప్తి చెందిన అత్రిమహర్షి మరికొన్ని వివరాలందించాడు.

" సూత దంపతులు సంతానం కోసం బ్రహ్మదేవుణ్ని ప్రార్థించారు. బ్రహ్మ వారికొక కృష్ణ విగ్రహాన్ని ప్రసాదించి పూజించుమన్నాడు. ఆ దంపతుల ప్రార్థన నాలకించి విష్ణు భగవానుడు దర్శన మిచ్చి మీ గర్భమందు మూడుసార్లు జన్మిస్తా" నని వరం ప్రసాదించాడు.

మొదటిసారి సనకునికి బ్రహ్మచర్యం ఇచ్చిన పృశ్నిగర్భనుగా జన్మించాడు. రెండవ సారి సూత దంపతులు కశ్యప

దంపతులుగా అవతరించగా వారి గర్భాన విష్ణువు వామనుడుగా జన్మించాడు. మూడోసారి దేవకి వసుదేవులుగా జన్మించిన సూత దంపతులకు శ్రీకృష్ణుడిగా జన్మించాడు. కాల గమనంలో ఆ విగ్రహాన్ని శ్రీకృష్ణుడే స్వయంగా ద్వారకలో ప్రతిష్ఠించాడు. ద్వాపర యుగాంత ప్రళయంలో ఆ విగ్రహం గాలిలో తేలింది. వాయుదేవుడు దేవగురువు బృహస్పతి ఆ విగ్రహాన్ని ప్రతిష్ఠించేందుకు అనువైన స్థలాన్ని వెతికారు. కేరళ ప్రాంతములో అందమైన కమలా పుష్పాల సరస్సు ఒడ్డుకు పరమ శివుని సహాయంతో ప్రతిష్ఠించారు. దేవగురువు వాయువు ఇద్దరూ కలిసి ప్రతిష్ఠించారు కాబట్టి ఆ స్థలం గురవయ్యూర్‌గా ప్రసిద్ధి గాంచింది.

వేల సంవత్సరాల చరిత్రను జీర్ణించుకున్న గురువయ్యూర్ దేవాలయం పాండ్య రాజుల కళా పిపాసకు అద్దం పడుతుంది. కృష్ణమూర్తి సన్నిధిలో... ఆరోజక్కడే ఉండిపోయారు.

తెల్లవారి భారత్ బందని తెలిసింది. ధైర్యం చేసిన డ్రైవర్ వెళ్ళి తీరాలన్నాడు.

ఏమౌతుందో ఏమోనని ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని బస్సెక్కారు యాత్రికులు.

## 11

కేసును దర్యాప్తు చేస్తున్న పోలీసాఫీసర్లను కలిసి మాట్లాడింతర్వాత అంధకారంలో రాకాసి కనబడినట్టయింది నాగేందర్‌కు. నేలకు కొట్టిన బంతి మరింత పైకెగిరినట్టు – పట్టుదల రెట్టింపైంది. రహస్యాన్ని ఛేదించాలనే పట్టుదల హైదాబాద్‌కు లాక్కెళ్ళింది.

అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకుణ్ని కలిసి విషయమంతా వివరించాడు. అసెంబ్లీలో చర్చ జరిగింది. కేసు తిరగదోడి సరియైన దర్యాప్తు జరిపి దోషుల్ని శిక్షించేలా చర్యలు తీసుకొమ్మని పోలీసు డైరెక్టర్ జనరల్ కాదేశాలందినై.

మరోవైపు వార్తా పత్రికలు శవాన్ని చూచిన ప్రత్యక్ష సాక్షుల కథనాలు సేకరించి ప్రచురించినై. తలకు బలమైన గాయాలున్నాయని, ముక్కు చెవుల ద్వారా రక్తం కారిందని బెడ్‌రూంలో – బాత్రూంలో రక్తముందని, అది హత్యేనని అనుమానిస్తూ–పోలీసులపై ప్రజల విశ్వాసం సడలి పోతుందని రాశాయి.

సుధాకర్ హత్య కేసుకు సంబధించిన ఫైలు తెప్పించుకుని స్వయంగా పరిశీలించారు యస్పీ–డియస్పీలు. గూఢాచారులకు రహస్య ఆదేశాలు జారీ అయినాయి.

ప్రాథమిక దశలో కేసు మూసేసిన యస్పై సస్పెండయాడు. పోస్టుమార్టం చేసిన డాక్టరుకో ప్రశ్నావళి పంపించి జవాబులు తెప్పించుకున్నారు. డాక్టరుగూడా సస్పెండయాడు.

సుమతి, పిల్లలు డీయస్పీ ఆఫీసులో హాజరయారు.

బెరుకు బెరుగ్గా నిల్చుంది సుమతి ఛాంబర్లో. కంటి రెప్పల్ని నీటి తెర కప్పేస్తుంది.

"నువ్వేం భయపడాల్సిన పనిలేదమ్మా! అడిగిందానికి జవాబులు సరిగ్గా చెప్పు. అబద్ధాలు చెబితే అనర్థం జరిగిపోతుంది, జాగ్రత్త!" మర్యాదగా హెచ్చరించాడు డీయస్పీ.

సరేనని తలూపింది సుమతి.

"నీ మరిది సుగుణాకర్‌కూ – నీకూ అక్రమ సంబంధముందనీ, మీరిద్దరు కలిసి నీ భర్తను చంపారంటున్నారు... నిజమేనా?"

సుమతి గుండెల్లో అగ్ని పర్వతాలు పేలినై. ఒళ్ళంతా మంటల్లో కాలిపోతున్నట్టయింది.

" ఆ మాటన్నందుకు మిమ్మల్ని ముక్కలు ముక్కలుగా నరికి కాకులకు, గద్దలకు వేయాలి" అనాలనిపించింది.

కాని పోలీసుల అనుమానం తీర్చాల్సిన బాధ్యత తన మీదుందని గుర్తుకొచ్చింది.

"అదంతా శుద్ధ అబద్ధం సార్!" చిన్నగా అరిచి కంట్రోలు చేసుకుంది. " మొదట్నుంచీ సుగుణాకర్‌కు వాళ్ళన్న మీదా, నా మీదా విపరీతమైన కోపముంది. మావారు చనిపోయారనగానే ఆయన్ను నేనే చంపానని ప్రచారం చేస్తూ ఏడ్చాడు. అవన్నీ దొంగ ఏడుపులే సార్! నా భర్తా, నేనూ ఎన్నడూ తగవులాడలేదు. మా అన్యోన్నత గురించి ఎవ్వరూ వేలెత్తి చూపలేరు. ఆయన అనురాగానికి పులకించి ఇద్దరు పిల్లలకు తల్లినయాను. ఇంటి గౌరవం నిలిపేందుకు మరుదుల్ని నా తోబుట్టువులుగా భావించాను. మావారి నిరంతర శ్రమ వల్లనే మా కుటుంబానికి సమాజములో గుర్తింపు వచ్చింది. అన్ని సమయాల్లో ఆయనకు చేదోడు వాదోడుగా ఉన్నాను." పూడుకుపోయే గొంతును బలవంతంగా సవరించుకుంది.

" కొన్ని రోజుల క్రితం మా కుటుంబాలు వేరయాయి. అన్నింటికీ నా భర్తే ఓర్చుకుని వాళ్ళడిగినంతిచ్చాడు. అమృత హృదయుడైన నా దైవం-సుధాకర్ గారితో జీవితాంతం కలిసి నడవాలనుకున్నాను—కలలు గన్నాను కాని.... కలల్ని కల్లలు చేసుకుని ఒంటరిగా మిగలాలనుకోలేదండీ...." అంతరంగములో కడలి తరంగాలు ఉవ్వెత్తున ఎగసి పడుతున్నై.

సుమతిని బయటకు పంపించి ఐదేళ్ళ కౌముదిని కూచోబెట్టుకున్నాడు డీయస్పీ. వణ వణ వణికిపోతుంది కౌముది.

"నీ పేరేమిటి పాపా?" డీయస్పీ పలకరింపులో ఆప్యాయత తొణికిసలాడింది.

కౌముది వణుకు తగ్గుముఖం పట్టింది.

చాక్లెట్లు తెప్పించి చేతికిచ్చి

"మాపాప చాల మంచి పాప! చెప్పమ్మా నీ పేరు?" ఒళ్లో కూచోబెట్టుకున్నాడు.

"నా పేరు కౌముది."

"పేరు చాలా బావుంది. మా పాప పేరుగూడా కౌముదే.... సరే....నువ బడికెల్తున్నావా?"

"ఆ వెల్లుతున్నా....మా బడిల వో తొర్రి పండ్ల టీచరుంద"

" ఊహుం.... ఐతే ఆమె గుణింతాలు ఎలా చెబుతుంది? "

గారాబం జాలు వారింది.

" ఆ టీచర్ చెప్తుంటే మేమంతా నవ్వుతాం " కిసుక్కున నవ్వి చాక్లెట్ నోట్లో వేసుకుంది. డీయస్పీకిగూడా నవ్వొచ్చింది.

" ఆహాఁ.... నాకో సంగతి తెలీకడుగ తాను చెబుతావా పాపా?" టేబుల్ మీదకు చేరింది కౌముది.

"ఓ చెబుతా కానీ... " చేయి చాచింది.

మరో చాక్లెట్ అందింది.

" మీ అమ్మా నాన్న లెప్పుడైనా దెబ్బలాడుకునేవారా?"

" లేదంకుల్... కాని గదిలో అప్పుడప్పుడు నవ్వుకునేవారు"

కళ్లు అరచేతులైనై.

"అలాగా....సరే— మీరారోజు గుడికెళ్ళేప్పుడు మీ నాన్న ఏంజేస్తున్నాడూ?"

"ఇంట్ల పూజచేసి వస్తనని పూజ గది లోపలికి పోయిండు"

"అప్పుడు మీ ఇంట్లో ఇంకెవ్వరున్నారమ్మా?"

"ఎవ్వలూ లేరు, నాన్న ఒక్కడే .. "

"మరీ....మరి...మీ తమ్ముడో!—"

"వాడొట్టి అల్లరి వెధవండీ! మా అమ్మనెత్తుకొమ్మని ఏడ్చి చంక కెక్కాడండీ! "చాక్లెట్ చప్పరిస్తూ" వాడెప్పుడూ అంతే. నన్నెత్తుకోనియ్యడు. అమ్మ ఎప్పుడూ వాణ్ని ఎత్తుకుంటుందంకుల్. గుడికి పోయేదాకా ఎత్తుకుంది మామ్మ." తన కేదో చెప్పరానంత అన్యాయం జరిగిపోయినట్టు మూతి మూడొంకర్లు తిప్పింది.

## 12

యాత్రికుల ప్రత్యేక బస్సు ఊటీ చేరుకుంది. మెత్తని పరుపులు పరిచినట్టుంది బొటానికల్ గార్డెన్స్ నేల. తాటి చెట్లలా పెరిగిన నీలగిరి చెట్లు, రోడ్డు కిరువైపులా ఆకు పచ్చని చీరలు ఆరేసినట్టు-కాఫీ తోటలు, మబ్బు కన్నెలు చెమ్మచెక్కలాడు కుంటున్న నీలాకాశం....ప్రకృతి అందాలు కను విందు చేసినై.

మైసూరు, బెంగుళూరు నగరాలు సుగుణమ్మను ప్రభావితం చెయ్యలేదు. మైసూరు నుండి బెంగుళూరు వచ్చేప్పుడు శ్రావణ బెల్గోళా, బేలూరు, హలీ బేడుల నుండి ప్రయాణించింది బస్సు.

ఒకే రాయితో చాలా ఎత్తుగా చెక్కబడిన గోమటేశ్వర విగ్రహం శ్రావణ బెల్గోళాలో చూడ ముచ్చటేసింది. బేలూరు, హాలీబేడు శిల్ప సౌందర్యం ముగ్ధుల్ని చేసింది. తురుష్కుల దండ యాత్రలో అవశేషాలుగా మిగిలిన విగ్రహాలు "మా గతి ఇంతేనా?" అని అడిగినట్టనిపించింది. హృదయాలు ఉద్వేగంతో ఉప్పొంగాయి. అనుకోకుండా కొందరి కళ్లు తడయ్యాయి.

బెంగుళూరులో భోంచేసి తిరుగు ప్రయాణానికి సిద్ధమైనారు. తాను యాత్రికులకు బయలుదేరే ముందటి సంఘటన సుగుణమ్మ ఎదలో కదలాడింది.

మీరిద్దరూ వేరయారు. మనసుల్లోంచి కల్మషాలు కడిగేసుకోండిహ. నేను మాత్రం దక్షిణ యాత్రల కెళ్లొస్తాను" అంది తను. వినయ్‌కుమార్ గూడా అక్కడే ఉన్నాడప్పుడు.

"దక్షిణ యాత్రలంటే ఎక్కడిదాకా? డబ్బు లెలా?" సుగుణాకర్‌కు కలుక్కుమంది.

"దక్షిణ యాత్రలంటే రామేశ్వరం దాటి కన్యాకుమారి దాకా. రామేశ్వరంలో సేతుతీర్థం తెస్తా. బ్రతికుంటే ఎప్పుడన్నా కాశీవెళ్ళి విశ్వనాథుని కభిషేకం చేయిస్తా. మహా అంటే ఓ నాల్గు వేల రూపాయలౌతుంది. ముగ్గురన్నదమ్ములు తలా యింత సర్దితే పోతుంది" మనసు పొరల్లో భర్త మెదిలాడు. "మీ నాన్న బ్రతికున్న రోజుల్లో జంటగా వెల్దామనుకున్నాం. కుదరలేదు. కనీసం ఒంటరిగా నన్నా వెళ్లొస్తా. కొడుకులు పెరిగారు. నాకింకేం దిగులూ..." తన హృదయ కవాటాలెందుకో కదలాడినై. గొంతు మూగబోయిండి.

"చిన్నన్నా, పెద్దన్నా లక్షలాస్తి పంచుకున్నారు." కలువలకుంట కెళ్ళబోతూ వినయకుమార్ "ఇక్కడి ఆస్తుల వివరాలన్నీ ముందు నాకు తెలీక వెధవన్నై—ఊళ్ళో ఉన్న బోడి ఆస్తితో సరిపెట్టుకుంటానన్నాను. నువ్వు గూడా నాకో సలహా ఇవ్వలేదమ్మా! నా కన్యాయం జరిగిపోయింది. ఇప్పుడు నా దగ్గర డబ్బులెక్కడివీ! క్షమించమ్మా!" అనేశాడు_తనవైపదోలాచూస్తూ.

తన దృష్టి సుగుణాకర్ వైపు మరలింది. సుగుణాకర్ చూపులు గదిలోనున్న దేవకిపై పెళ్ళాయి. ఆ చూపులేం మాట్లాడుకున్నయో, ఏమోగాని సుగుణాకర్ ఆముదం తాగినట్టయిపోయాడు.

"అమ్మా... నా సంగతంతా తెలుసుగదా! దుకాణంలో సరుకులైపోయినై. చిన్న చిన్న అప్పులు కట్టాలి. సుధాకరన్న కిరవై వేలివ్వాలి. ఈ పరిస్థితుల్లో నేనేమివ్వగలను?"

దిక్కులు విరిగి మీద పడినట్టయింది.

అసలు వీడుద్దేశ్యమేమిటి? వీడికొరకు నేను చేసిదంతా.... ఇంతేనా?

విషయమంతా సుధాకర్‌కు చెబుతూంటే ఊపిరి బిగుసుకు పోయింది. ఆగని అశ్రు బిందువులు టప టపా రాలినై.

"అంతా కలిసి నాల్గు వేలవుతుందా?" చలించిన సుధాకర్ "ఆ మాత్రానికే ఇంత బాధ పడాలామ్మా? మాకు జన్మనిచ్చావు. అష్టకష్టాలనుభవించి పెంచి పోషించావు. విద్యా బుద్ధులునేర్పావు. ఎన్ని చేసినా మాతృ ఋణం తీరేదిగాదు. ఆ నాల్గువేలు నేనే ఇస్తాను. బయలుదేరు" అన్నాడుచేతి గుడ్డతో తన కళ్లుఅద్దుతూ.

కొండెక్కినంత ఆనందమన్పించింది. ఉప్పొంగిన వాత్సల్య కెరటాలు మరోసారి కళ్ళనాశ్రయించినై.

వీడికి నేనన్యాయం చేసినా, వీడు నాకు న్యాయమే చేస్తు న్నాడు. భగవాన్....

" ఎందుకు సుగుణమ్మా కళ్ళలో ఆ నీళ్ళు. " భుజాలు పట్టి అడిగింది జానకమ్మ.

"నిజంగానా....!" కళ్ళు తడుముకుంది. ఔను. తుడుచుకుంది.

"కళ్ళల్లో నలత పడిందంతే."

కాస్సేపు మాట్లాడాక ఆవిడ అలవాటు ప్రకారం నిద్రలోకి జారుకుంది. ఆశ్చర్యం....బస్సు కుదుపులు ఊయలలో ఊగిస్తు న్నట్టనిపిస్తున్నై. తనగ్గూడా నిద్దరొస్తుంది....

— — —

"సుధా....సుధా....!"

రాత్రంతా ప్రయాణం చేసి తెల్లవారగనే బస్సు దిగి ఇంటికి చేరింది సుగుణమ్మ. తలుపులు కొట్టింది.

"ఎవరదీ....?"తలుపులు తీసి పక్కకు తప్పుకుంది సుమతి.

"ఇంకెవ్వరూ లేవలేదెందుకో" అనుకుంటూ లోపల అడుగుపెట్టి

" బొట్టు చెదిరినట్టుంది. ముందెళ్ళి బొట్టు పెట్టుకు రాపో!" అంది సుమతితో.

గుండె జారిన సుమతి తల నేలకు వేలాడింది.

సుమతి తల్లి ముందు కొచ్చి

"సుధాకర్ చనిపోయాడు వదినా: నిన్ననే శ్రాద్ధ కర్మలవీ ఐనాయి" అంటూ కొంగు నోట్లో కుక్కుకుంది.

తుపాకి గుండులా దూసుకొచ్చిన మాటల్ని జీర్ణించుకునేందుకు కొన్ని క్షణాలు పట్టింది. శరాఘాతం తగిలినట్టుగా విభ్రమంగా చూసింది సుగుణమ్మ. ఆ తర్వాత గుండె చెరువుకు గండి పడింది. పగిలిన అగ్ని పర్వతంలా బోరుమంది.

సుగుణాకర్ వచ్చి తీసికెళ్ళాడు తల్లిని. విషయాలన్నీ వివరించాడు.

"దేవుడు లాంటి అన్నను వదిన దయ్యమై చంపిందమ్మా" అన్నాడు చివరికి_కళ్ళద్దుకుంటూ.

సుగుణమ్మ శరీరంలో కండరాలన్నీ ఉండ చుట్టుకుపోతున్నై. సుమతిని నరుక్కుతిందామన్నంత ఆవేశమొస్తుంది.

"ఏమే సుమతి ముండా!" సుమతి వద్దకు పరుగుతో వచ్చి "చివరికి సుధాకర్ని మింగి నీళ్ళు దాగావా? ఇప్పుడు తృప్తిగా ఉంద? నీ యమ్మ కడుపు కాలిపోను. నా కడుపు కాల్చే సావు గదే! అసలూ.... నీ వల్లనే వాని బుద్ధి ఖూడిదై పోయింది. వాని ముందు టక్కులు చూపి నీ దొంగాటకం నువ్వాడావు గదూ!" ఇంకేదో అనబోతూ ముందుకు రాబోయింది.

నాగేందర్ మధ్యలో కొచ్చాడు.

"చూడత్తా! మువ్విప్పుడే వచ్చావు. విషయాలన్నీ పూర్తిగా తెలుసుకొని మాట్లాడితే బావుంటుంది. పుట్టి మునిగిందని సుమతి

ఏడుస్తుంటే పుట్టెడు ఆస్తి కోసం - కొందరేడుస్తున్నారు. సుమతి పిల్లల్ని చూడత్తా ఎలా బిక్కు బిక్కు మంటున్నారో...."

" నాకడుపే కాలిపోయింది " సుగుణమ్మ గుండె లెగిసి పడుతున్నై. "చెట్టంత నా కొడుకునే పొట్టన బెట్టుకుంది. ఇంక దాని పిల్లలా....."

సుమతి తల్లి, నాగేంధర్, అరుంధతి అవాక్కైపోయారు.

చూపులు కరువైన మనిషిలా ఒక్కొక్క అడుగే ముందు కేస్తూ గదిలోకి నడిచింది సుమతి.

" ఒసే సుమతి ముండా! భార్యను కాలబెట్టిన భర్తల గురించే విన్నాం, భర్తనే కాల్చేసిన మొదటి భార్య వయ్యావు గదూ! ఎప్పుడో ఓసారి నీమీద కిరసనాయిల్ కుమ్మరించి నేనే అంటిస్తా చూస్తుండు" పిచ్చెక్కిన సుగుణమ్మను రెక్కలు పట్టుకు తీసికెళ్ళారు. దేవకి-సుగుణాకర్‌లు.

## 13

సుగుణాకర్ అరెస్టయాడు.

లాకప్పులో మొదటిరోజు లెంపల వాయింపు జరిగింది.

"నాకేం తెలీదు. మా అన్న దేవుడిలాంటివాడు. మా వదిన గుణమే మంచిది కాదు. అవిడే చంపుంటుంది సార్" విన్నవించుకున్నాడు సుగుణాకర్.

రెండో రోజు వీపు వచ్చడైంది. నవారు వదులైన మంచం లాగయాడారోజు. పోలీసు దెబ్బలిన్ని భరిస్తూ

"నాకేం తెలీదంటే తెలీదు. మా వదిన నడగండి సార్!" కాళ్ళావేళ్ళా పడి బతిమాలాడు. వాయింపు రెట్టింపైంది. పెడ బొబ్బలు పెట్టాడు.

కలువలకుంట నుండి వినయ్‌కుమార్‌ను రప్పించింది సుగుణమ్మ. అతడే పోలీస్‌స్టేషన్‌కు క్యారేజి తీసికెళ్తున్నాడు.

దుకాణంలో గూడా ఉంటున్నాడతడే.

మధ్యాహ్నం కారేజీతో వచ్చినప్పుడు తన బాధనంతా వినయకుమార్‌తో చెప్పి సాధ్యమైనంత తొందరగా విడిపించుమని ప్రాధేయపడ్డాడు సుగుణాకర్.

ఏ వరాని కానరం. పీకి బోగులేసినట్టయింది.

సురేష్ ప్రయత్నంవల్ల స్థానిక నాయకుల దృష్టిమళ్ళింది. ఫోన్లు మోగినై. ఫలితం లేదు.

పగలంతా పోలీసులేమనరు. చీకటి పడగానే చిందులు వేస్తారు. నడిరాత్రి నరకం చూపిస్తారు.

మూడోరోజు మొకాళ్ళు మోచేతుల నట్లు లూజైపోయినై. తాత ముత్తాతలు తలలో తిరిగారు. తలకిందులుగా కోదండంవేసి

"ఇప్పుడైనా నిజం చెబుతావా .... కరెంటు షాకులు కావాలా?...."

గుహలో మేకముందు పులిలా గర్జించాడు కొత్త యస్సైని.

ఎన్ని శిక్షలనుభవించినా సరే తనకు కీడు కలిగించే విషయాలేవీ పోలీసులకు చెప్పొద్దనే దృఢ నిర్ణయం కరిగి కళ్ళ ద్వారా బయటికొచ్చేస్తుంది.

ఎంత బతిమాలితే అంత పెట్రేగిపోతున్నాడు కొత్తయస్సైని.

బతికుంటే కలువలకుంట కలువలమ్ముకు బతకొచ్చు.... చింతమడ్కలో చింతపండు ఏరుకు బతకొచ్చు .... బలమంతా గొంతులో కొచ్చింది.

"చెబుతా....నిజం చెబుతా" అరిచాడు.

కట్లూడిపోయినై. కుర్చీ వేసుక్కూర్చున్నాడు యస్సైని. స్టేషన్ రైటర్ కలం కాయితంతో వచ్చేశాడు.

కొన్ని వందల కిలోమీటర్లు ఏకధాటిగా పరుగెత్తిన వాడిలా దమ్ముదీస్తున్నాడు సుగుణాకర్. మాట్లాడేందుకు శక్తి చాలలేదు.

సర్కిలినిస్పెక్టర్, డియస్పీ గారలు గూడా వచ్చేశారు. మంచినీళ్లు, చాయ మొదటిసారిగా పోలీసుల తరపున అందాయి. తాగిం తర్వాత శక్తి పుంజుకుంది. మళ్ళీ తనిలా నిలదొక్కుకో గలుగుతానని ఒక గంట క్రితం ఊహించలేదు.

"ఇప్పుడు చెప్పు" అన్నాడు సి.ఐ.-టేప్ రికార్డర్ ఆన్‌చేసి.

"ఆరోజు.... మా అన్నా వదినలు నవగ్రహాల గుడిలో పూజలు చేస్తారని ముందే తెలుసు. సమయం కోసం వేచి చూస్తు న్నాను....చిన్నగా తెరుచుకున్న మగుణాకర్‌గొంతు మామూలు స్థితికొచ్చేసింది-"మా సుధాకరన్న చదువు పూర్తి కాగానే ఉద్యో గం దొరికింది. సంపాదించి వెనకేసుకున్నాడు. మా గంగాధ రన్నా, నాన్నలు చనిపోయింతర్వాత అతడే సర్వాధికారం చెలాయించాడు. చిన్నవాడు వ్యవసాయం చేసుకుంటున్నాడు. నాచేత దుకాణం పెట్టించాడు సుధాకరన్న. తనేమో లక్షలాస్తి సంపాదించుకున్నాడు. అతని చాటుకు కేవలం యాభై వేలుదాచు కుంటే పంచివ్వమని పట్టుబట్టాడు....." మాట పెగల్లేదు.

"ఐతే ఏమైంది? ఇంతకి సుధాకర్ను నువ్వు చంపావా లేదా?" అడిగాడు డీయస్పీ.

మళ్ళీ శక్తిని కూడదీసుకుని "చంపాను, నేనే చంపాను సార్...." చెప్పేశాడు.

"ఎప్పుడు? ఎలా?" యస్పై కంఠం ఖంగుమంది.

"ఆరోజు మా వదిన పిల్లల్తో నవగ్రహాల గుడి కెళ్ళింది. సుధాకరన్న ఇంట్లో పూజచేసి వెల్తానన్నాడు. అతడు పూజా గదిలో కూర్చుండగానే నాకు ప్రాణం లేచొచ్చింది. ఏదోదయ్యం వన్నావహించింది. దుడ్డు కర్ర చేతికి దొరికింది. వెనక నుంచి వెళ్ళి నెత్తిమీద బలంగా వేశానొకటి. అమ్మా అంటూ వెనక్కు తిరిగి చూచాడు. తలలోంచి రక్తం చిమ్ముతుంది. నా గుండె

ఝల్లుమంది. మరో దెబ్బ తలముందటి భాగమ్మీద గట్టిగా వేశాను. వెల్లకిలా పడిపోయాడక్కడే. పూజా గది నిండా రక్తమైంది. రెండు నిమిషాలు కొట్టుకుని ప్రాణాలొదిలాడు. కిరసనాయిల్ కోసం వెతికాను. అక్కడ దొరకలేదు. మా ఇంట్లోంచి తెచ్చి మీద చల్లేశాను. పూజా గదిలున్న అగ్గి పెట్టె తీసుకుని అంటించాను– కాల్చుకుని చనిపోయాడని అందరనుకోవాలి, లేదా మా వదిననే కాల్చి చంపిందని నమ్మించవచ్చు."

"మరి.... బెడ్ రూంలో, బాత్రూంలో రక్తమెక్కడిదీ?" డీయస్పీ కనుబొమ్మ లెగసిపడినై.

"సుధాకరన్న చనిపోగానే నా గుండె వేగంగా కొట్టుకుంది. నా చర్మ రంధ్రాల్లోంచి రక్తం చిమ్మినట్టయింది. రాబోయేఆస్తి కళ్ళల్లో మెదిలి ధైర్యమొచ్చింది. రక్తాన్ని దోసిలితో పడగ్గది నేలమీదా. పరుపుమీదా చల్లేశాను. దుడ్డుకర్రనూ, నా శరీరాన్నీ బాత్రూంలో కడిగాను." సుగుణాకర్ కాళ్ళూ చేతులూ వణికి పోతున్నై.

చాయలొచ్చాయప్పుడే. అందరితో పాటు సుగుణాకర్‌కు గూడా అందింది.

"చంపిం తర్వాత ఏంజేశావు" సి.ఐ.

"కంగారుగా ఇంట్లో కెళ్ళి బట్టలు మార్చుకున్నాను. మా పోర్షన్లో నిల్చుండి నా భార్య అంతా చూచింది–నోటి మాట రాక బెంబేలెత్తి పోతుంది.

"కొద్ది రోజుల్లో అస్తంతా మనకే వస్తుంది. నువ్వేం భయ పడకు. నేను హన్మాండ్ల గుడికెలుతున్నాను. నేను వెళ్ళింతర్వాత బయట కెళ్ళి మా బావగారిల్లు కాలిపోతుందని మొత్తుకో" మని చెప్పి వెళ్ళిపోయాను. నా భార్యకు ధైర్య మొచ్చింది. నేను చెప్పినట్టే చేసిందట."

"గంగాధరన్న అంటే ఎవరు?"

"మా పెద్దన్న. మా నాన్న మొదటి భార్య కొడుకు... పన్నెండు సంవత్సరాల క్రితం తప్పిపోయాడు. ఇంకా దొరః లేదు."

డీయస్పీ చేతికర్ర గాల్లోకి లేచింది.

"మరి.... ముందు మీ పెద్దన్నా, నాన్న చనిపోయిం తర్వాత అని చెప్పావుగదా.... అతడలా తప్పిపోయేందు కేమైనా చిన్న పిల్లోడా? నిజం చెప్పు!" గద్దించాడు.

"ఆరోజు తెల్లవారక ముందే మా కలువలకుంట నుండి ఈ ఊరికి నేనే సైకిల్ మీద తెచ్చి వదిలాను. ఆ తర్వాత ఏమైనాడో తెలీదు. అతనివద్ద యాభై వేల రూపాయల బ్రీఫ్‌కేసుంది"

డీయస్పీ బుర్రలో ఏదో మెరిసింది.

"మీ పెద్దన్న తప్పిపోలేదు. అతణ్ని నువ్వే చంపావు బద్మాష్" ఒక్కటంటించాడు.

సరదాకు సింహం జూలుపీకి దాన్నోట్లో పడిపోయిన ఎలుకలాగైపోయాడు-సుగుణాకర్.

ఒక్క నిముషం కాలం స్థంభించిపోయింది.

డీయస్పీ య్యసైన్సైకి సైగ చేశాడు మళ్ళీ కోదండం వేయ్యాలని.

"వద్దుసార్.... మా పెద్దన్ననుకూడా నేనే చంపాను" అరిచి కూలబడిపోయాడు - సుగుణాకర్.

"ఎలా? వివరంగా చెప్పు!" డీయస్పీ కూచున్నాడు.

తన సర్వస్వం దోచుకుంటున్న వాడికి సహకరిస్తున్నట్టని పించింది-సుగుణాకర్‌కు.

"తెల్లవారక ముందే సైకిల్ మీద వట్నాం వస్తున్నాం. ఇంకా మసక చీకటిగా ఉంది. దయ్యాలబావి దగ్గరికి రాగానే

సైకిలాపుమన్నాడు—గంగాధరన్న. బావి ప్రక్కన మూత్రానికి కూర్చున్నాడు. యాభై వేల రూపాయల బ్రీఫ్‌కేసు సైకిల్‌కుంది ఆలోచన తళుక్కుమంది. పెద్ద రాయెత్తి అతని తలమీద వేశాను. అమ్మా అంటూ బావిలో పడిపోయాడు. మరో నాల్గు రాళ్లు వేసి చేతులు దులుపుకున్నాను. డబ్బు తీసుకుని బ్రీఫ్ కేసుకూడా బావిలో పడేశాను."

"మరా యాభై వేల రూపాయలేంచేశావ్?"

"పట్నమొచ్చి నాపేర బ్యాంకులో వేసుకున్నాను. మధ్యాహ్నం తిరిగి మావూరెళ్ళి అన్నను బస్సెక్కించి వచ్చావన్నాను."

## 14

సుగుణాకర్ అరెస్టవగానే—సుగుణమ్మ రైస్ కుక్కర్‌లో ఉడికిపోతున్న టమాటాలాగైపోయింది.

"సుధాను మింగి నీళ్లు దాగింది చాలలేదా? సుగుణాకర్ వెంట బడ్డావుగదూ! వాడు నీ క్షేమన్యాయం చేశాడని వానిమీదికి నెట్టేశావు?" సుమతిని నిలదీసింది. శాపనార్థాలు పెట్టింది. సుగుణాకర్ పోలీస్ స్టేషన్లో కక్కిన విషయాలు విని సుగుణమ్మ నివ్వెరపోయింది. స్వర్గ నరకాల మధ్య ఊగిసలాడ్తున్న జీవిలాగైపోయింది.

"గంగాధర్ విషయమప్పుడే గట్టిగా మందలించక తప్పు చేశానేమో.... నాలిక్కరుచుకుంది. సుడిగుండాల్లో చిక్కుకుపోయానా? దేవుడా....బావురుమంది.

దుకాణం గిరాకి బాగుంటుంది. ఆ గుమాస్తాతో కలిసి పం జేసినా ఒత్తిడిగానేవుంది. లాభాలు చూస్తుండే కళ్ళు తిరిగినంత వస్తైంది వినయకుమార్‌కు. అదే సంవత్సరం కొత్త కొత్త రోగాలొచ్చి పంటచేలు నేలమట్టమైనాయి. ఇద్దరన్నల్లాగా తాను

పట్నం ఆస్తి పంచుకుని పల్లెటూరు ఆస్తి పంచిస్తే బావుండేదని పించింది. కూతురూ, భార్యను పుట్టింట్లో వుంచి వచ్చాడు.

సుగుణాకర్‌కు కోళ్ళఫారంలో, మరికొన్ని వ్యాపారాల్లో భాగస్వామ్యముందని తెలిసిం తర్వాత గుండె లబ లబ లాడింది.

"సుధాకరన్నకూ, నాకూ చెరో చెయ్యిచ్చి నాల్గు చేతులా సంపాదించుకున్నాడమ్మా సుగుణాకరన్న." అన్నాడు తల్లితో ఆగలేక.

మౌనమే సమాధానమైంది.

" నాకూ ఓ కూతురుంది. పెరిగింతర్వాత దాని పెళ్ళి చెయ్యాలి. పంటల్లేవు. ఏంచెయ్యాలమ్మా" అడిగాడు మరోసారి.

వాడరెస్టయి జైల్లో కూచుంటే నీ ఏడుపేందిరా?" గుడ్లురిమింది.

సుగుణాకర్ ఇచ్చిన స్టేటుమెంటు పత్రికల్లో " ఇద్దరన్నల్ని చంపిన ముద్దుల తమ్ముడు " హెడ్డింగుతో వచ్చింది. పట్టణ జనాల్ని కుదిపేసిందా వార్త. ముక్కుమీద వేలేసుకున్నారు. వీధి జనాలు. మొహం గుద్దినట్టంట్టుంటే భరించలేకపోయింది సుగుణమ్మ. సురేశ్, అతని మిత్ర బృందం రంగ ప్రవేశం చేసింది. సుగుణాకర్‌ను సాధ్యమైనంత త్వరగా విడిపించాలని బతిమాలింది సుగుణమ్మా. ఖర్చులకేమీ వెనకాడొద్దంది దేవకి.

శవం తాలూకు ఫోటో లిమ్మన్నారు పోలీసులు. ఫోటో గ్రాఫర్ల ను నిలదీశారు.

"ఆఫోటోలు సరిగా రాలేదని రీలు కాల్చేశా"నన్నాడొకడు.

" అదేరోజు రాత్రి మా దుకాణంలో దొంగలు పడి అన్నీ ఎత్తుకపోయారు సార్!" అన్నాడింకొకడు.

నెగెటివ్‌లుగూడా దొరకలేదు.

ఏం చెయ్యాలో .... తోచలేదు డీయస్పీకి. ఓసారి నాగేందర్‌ను పిలిపించి మాట్లాడాడు. నాగేందర్‌లో పట్టుదల పెరుగు

తుందని తెలిసింది.

ఫోటో గ్రాఫర్స్ లాకప్‌లో కొచ్చేశారు. బయటి నుంచి ఒత్తిడి తెచ్చి బయటికొచ్చేశారు.

ఈ కేసును సి.బి. సి.ఐ.డీ తో దర్యాప్తు చేయించాలని సుమతితో దరఖాస్తు పెట్టించాడు నాగేందర్.

"ఫస్టిన్‌ఫర్మేషన్లో శవం తల నుండి ముక్కునుండి రక్తం కారుతున్నట్టుంది. పూజా గదిలో, బెడ్రూంలో బాత్రూంలో రక్తముందని శవపంచాయితీలో తేలింది. నూటికి నూరుపాళ్లు కాలి చనిపోయాడని పోస్టుమార్టం రిపోర్టుంది. కాలి చనిపోతే రక్తం ఎందుకు కారింది? మొదట తెల్లకాగితమ్మీద సురేశ్ నా సంతకం తీసుకొని తన ఇష్టమొచ్చినట్టు రాసిచ్చాడు పోలీసులకు. నేనే స్వయంగా పోలీస్ స్టేషన్ వెళ్ళి రిపోర్టిచ్చినట్టు పోలీసు డైరీలో ఉంది. నేనసలు శవం వద్ద నుండి కదల్లేదు. నా భర్త నిజానికి ఉదయం ఆరున్నర – ఏడు మధ్య చనిపోయాడు, కాని పోస్టుమార్టం రిపోర్టులో మధ్యాహ్నం రెండూ రెండున్నర మధ్య చనిపోయినట్టుంది.

పోస్టుమార్టం జరిగింది మధ్యాహ్నం రెండు గంటలకు, అంత్యక్రియలు సాయంత్రం నాలుగ్గంటలకైనాయి. అలాంటప్పుడు పోస్టుమార్టం రిపోర్టును నమ్మవచ్చా?"

శవం ఫోటోలు నెగెటివ్‌లతో సహా మాయమవడంలో ఆంతర్యమేమిటి?" మొదలైన ఆరోపణలు సుమతి దరఖాస్తులోనివి. అవన్నీ సవాళ్ళయి కూచున్నై పరిశోధకులకు.

## 15

వినయ్‌కుమార్ భార్య వసంత కూతురుతో వచ్చేసింది. సుగుణాకర్ ఆస్తుల్ని చూస్తుంది. వారం రోజులనుండి కళ్ళు బైర్లు కమ్మినై. మన కన్యాయం జరిగిపోయిందని భర్తతో

పోరు పెడుతుంది.

చంద్రశేఖర్ ప్రయత్నం వల్ల సుమతికి ఫ్యామిలీ పెన్షన్ మంజూరైంది. గ్రాట్యుటీ–పి.యఫ్‌ల సొమ్ము గూడా వచ్చేసింది. ఇంత తక్కువ కాలంలో మంజూరవడం అసాధ్యం కాకున్నా ఆశ్చర్యమనిపించింది.

సుగుణాకర్‌ను జుడీషియల్ కష్టడీకి జిల్లాజైలుకు తీసికెళ్ళే ముందు ఇంటికి తీసుకొచ్చారు.

సుగుణమ్మ ఎదురెళ్ళి అప్యాయంగా కౌగలించుకుంది. కంట తడిబెట్టింది.

ఆర్నెల్లు అండమాన్ జైల్లోవుండి వచ్చినట్టున్నాడు సుగుణాకర్. వినయకుమార్ కదోలాగుంది.

"ఎంత పంజేశావురా సుగుణా! నువ్విలా చేస్తావని కలలో గూడా అనుకోలేదురా" అంది తల్లి నెత్తికొట్టుకుని.

పోలీస్ స్టేషన్లో దెబ్బల కోర్చుకోలేక ఏవో చెప్పానమ్మా. అవన్నీ అబద్ధాలే. నువ్వుమాత్రం సురేశ్‌తో చెప్పి నన్ను తొందరగా బెయిల్‌మీద విడిపించమనమ్మా"అన్నాడు స్నానానికెల్తూ.

"నీ ధోరణి వక్రమైంది. తల్లితోనైనా నిజం చెప్పేయ్!" సుగుణాకర్ అంతరాత్మ గోలచేసింది.

"నోర్మూయ్ నీ గోల నా కనవసరం!" అంతరాత్మ నోరు నొక్కింది ఏదోశక్తి.

"అవన్నీ అబద్ధాలెలాగౌతాయన్నా? గంగాధనన్న దగ్గర యాభై వేలుంది నిజమేనాయె. సుధాకరన్నకూ నీకూ యాభై వేల విషయంలో గొడవైన సంగతీ నిజమేనాయె. ఆస్తి కొరకే చంపావని చెప్పావు గదా!" అడిగాడు వినయ్‌కుమార్ ఉండబట్టలేక.

భోంచేస్తున్న సుగుణాకర్‌కు ముద్ద దిగడం కష్టమైంది.

ముళ్ళ పొదలో సునులేత పాదాలుంచినంత బాధైంది. జవాబి వ్వాలన్పించలేదు.

వెళ్ళిపోతూ

"ఒరేయ్ వినయ్! ఏవేవో ఆలోచించి బుర్ర పాడుచేసు కోకు. నేనొచ్చేంతవరకూ నువ్వూ-వసంతా ఇక్కడే ఉండండి. నేనొచ్చిం తర్వాత అన్నీ చెబుతా. నువ్వు మాత్రం సురేష్‌ను ఈరోజే అమ్మ దగ్గరికి తీసుకురా. నన్ను త్వరగా బెయిల్ మీద విడిపించే ప్రయత్నం చెయ్!" బతిమాలాడు తొలిసారి. అత్తారింటి కెల్తున్న ఆడ వడుచులా - ఇద్దై పోతూ.

సుగుణమ్మకూ, దేవకికి కడుపుల్లో చేయిపెట్టి దేవినట్టని పించింది.

"నేనూ వత్తా నాన్నా!" చెంగలించింది సుగుణాకర్ కూతురు.

దేవకి పాపను గుండెలకు హత్తుకుంది గట్టిగా.

వడ్డీకి అప్పు తీసుకున్న ఆసాములు వినయ్‌కుమార్ చేతికే డబ్బిచ్చి నోట్‌లు తీసికెల్తుంటే పిచ్చెక్కినట్టయిందతనికి.

"ఇకనేనేమో—పల్లెటూళ్లో పొద్దస్తమానం మట్టిలో బొర్లాలి. తీరా పంటలు చూస్తే చీడ పురుగుల కాహారమౌతున్నై. పూట పూటకూ భార్యాబిడ్డల మొహాల్లో నీలి నీడలు చూడాలి.

మరి సుగుణాకరన్నకో...! ఇక్కడ మెయిన్ రోడ్డులో దుకాణం. ఒక గుమాస్తా, వడ్డీవ్యాపారం, కోళ్ళఫారం, ఫైనాన్స్ కంపెనీలు— అమ్మగూడా వాడికే సాయం చేస్తుంది.

గంగాధరన్నా, సుధాకరన్నలను గుట్టు చప్పుడు కాకుండా ముండమోపి లక్షలాస్తి సొంతం జేసుకుని మహారాజులా బతుకుతున్నాడు. సుధాకరన్నను అతడే చంపకపోతే వెంటనే ఇరవై వేల రూపాయలు సొంతంగా ఎందుకు ఖర్చు చేశాడు?

ఒకే తల్లి కనిపెంచిన బిడ్డల మధ్య ఇంత అంతరమా? తనకెందుకింత అన్యాయం చేసిందమ్మ?"

తెగని ఆలోచనలు వినయకుమార్ బుర్రను తొలిచేస్తున్నై. మరోవైపు-వసంత చెవిలో ఇల్లు గట్టుకుని చెబుతుంది. విషయమేమిటో తేల్చెయ్యాలని.

పదిహేను రోజులు గడిచాయిలాగే.

సుగుణాకర్‌కు బెయిల్ సంపాదించేందుకు సురేష్ విశ్వ ప్రయత్నాలు చేస్తున్నాడు.

ఆరోజు రాత్రి .. భోజనాలైనై. సుగుణమ్మ కిళ్ళీ కట్టుకుంటుంది.

"అమ్మా నేనో విషయమడుగుతాను," కదిపాడు చిన్న పిల్లాడిలా-వినయకుమార్.

ఆ మాటవిని బయట కొచ్చింది దేవకి. పాపను ఒళ్ళో వేసుకుని నిద్ర బుచ్చుతుంది.

వసంత గూడా వచ్చి కూర్చుంది.

"కొత్తగా మాట్లాడుతున్నా వేమిట్రా?"కుడితిలోపడ్డ ఎలుకలాగైపోయింది సుగుణమ్మ.

"కలువలకుంటలో పొలాన్ని నమ్ముకుని బతకడం కష్టమైపోతుంది. ఒళ్ళంతా హూనం చేసుకున్నా తినేందు గ్గూడా గింజలు రావడంలేదు. వ్యవసాయ పనులకు కూలీలు దొరకరు ...

"ఐతే ఏమైందీ...ఇన్నాళ్ళు బ్రతక లేదా?"

"ఇన్నాళ్లు వేరు, ఇప్పటి సంగతి వేరమ్మా! నాకూ ఓ ఆడపిల్లుంది....."

"ఐతే ఒక్క కూతురుతోనే సరిపెట్టుకుంటారా? ఇంకా పుట్టరా" దేవకి అందుకుంది.

"ఏమోనక్కా ఒక్కదాన్ని సాకడమే కష్టమైపోతుంది—

నీకేం— సుగుణాకర్ బావ లక్షలార్జించి పెట్టాడు. అత్తయ్య ఆశీస్సులుగూడా దండిగా వున్నాయి. పెద్దవాళ్ళ చల్లనిచూపుంటే ఎక్కడైనా నెగ్గుకు రావచ్చు." అంది వసంత. ఆవిడ ధోరణి వింతగా తోచింది.

"తనంటే చిన్నకోడలు కింత అభిమానముందా?" మురిసిపోయింది లోలోన సుగుణమ్మ. పెదవుల మీదికి రాబోయిన చిరునవ్వు నాపుకుని

"ఇంతకీ నువ్వడగాలనుకున్న దేమిటార్రా?" అంది.

"ఏం లేదమ్మా.. నేనుగూడా పట్నంలోనే ఉండిపోతా. అక్కడి పొలాల్ని నమ్ముకుంటే దరిద్రం పోదు. అమ్ముకుంటే ధరరాదు. నీ సేవలుచేస్తూ నీ కళ్ళముందే పడుండాలన్పిస్తుంది"

"మంచైనా చెడైనా పెద్దవారు దగ్గరుంటే కొండంత అండ" తాళం వేసింది వసంత. ఆవిడ మాట్లాడుతుంటే ఒంటి రాయి ముక్కు పుల్ల తళుక్కున మెరిసిపోతుంది. బుగ్గలు నాజూగ్గా కదుల్తున్నాయి.

"ఈవిడ ఇంత అందగత్తెనా—!" అనుకుంది సుగుణమ్మ.

"వాళ్ళ ఉద్దేశ్యమేమిటో ఓ పట్టాన అర్థం గాలేదు దేవకికి.

"ఐతే మరేం చేసి బ్రతుకుదామనుకుంటున్నారిక్కడా?" అడిగింది సుగుణమ్మ.

" ఆస్తి పంపకాల్లో నా కన్యాయం జరిగిపోయిందమ్మా! నువ్వే పూనుకుని సుగుణాకరన్న వద్ద ఏమన్నా ఇప్పిస్తే— ఇక్కడే ఏదో ఒక వ్యాపారం చేసుకుంటా." అన్నాడు వినయకుమార్ దీనంగా.

తుఫాను ప్రాంతం లోంచి సురక్షిత కేంద్రానికొస్తే, సురక్షిత కేంద్రాన్ని తుఫాను చుట్టుముట్టి నట్టనిపించింది-సుగుణమ్మకు.

"అదికాదురా—కావాలని నువ్వే కలువలకుంట ఆస్తి ఉంచుకున్నావు గదా! మిగతాది అన్నలు పంచుకున్నారు. ఆ మాయదారి పంపకాలేమో గాని మన కుటుంబానికి గ్రహణం పట్టినట్టయింది." మొహంలో కలియదిరిగిన బాధ సన్నటి కన్నీటి పొరల్లా పరిణతి చెందింది. "సుధాకర్ ప్రాణాలు పోయాయి. సుగుణాకరింకా జైల్లోంచి రాలేదు.— చివరికేమి కానుందో...."

"నాకు విషయాలన్నీ తెలీక అప్పుడలాగన్నా" గంగాధరన్న బాపతు యాభై వేలు, సుధాకరన్న బాపతు యాభై వేలు సుగుణాకరన్న దగ్గరనే ఉన్నాయిగదా! వాటిల్లోంచో యాభై వేలూ, నీకోసముంచిన లక్షనుండి మరో యాభై వేలూ.... కలిపి ఓ లక్షరూపాయలిప్పించు—" వినయకుమార్ మాట పూర్తి కాలేదింకా.

"ఏందయ్యోయ్ వినయ్!" దేవకి ముగ్గ పుటాలెగరేసింది. "నువ్వేదో మాకుపకారం చేసేందుకొచ్చావనుకుంటే, అప్పనంగా అపకారానికి దిగుతున్నావే! మాకిందికే నీళ్లు దెస్తున్నావన్న మాట. నవ్వుతూనే నట్టేట్లో ముంచేలాగున్నావ్!" చేప పిల్లల్లా కదలాడే కళ్ళల్లో ఎర్రజీరలు.

"అదేమిటక్కా?" వసంతకు రోషం పొడుచుకొచ్చింది. "మేమూ మీలాగా బతకొద్దా? సుధాకర్ బావను ముంచిందాంట్లో భాగమడగడం లేదుగదా: దుకాణం, ఇల్లూ, ఫైనాన్స్ షేర్లూ కోళ్ళ ఫారం భాగస్వామ్యం పంచివ్వమనడం లేదు గదా! మాకంత అత్యాశ లేదు. చిన్నవాళ్ళం గదా.... మీరు గూడా బాగా ఆలోచించి ఇవ్వండి. కావాలంటే కలువలకుంట ఆస్తి మీరుగూడా పంచుకోండి" అంది _ వేడి చేసిన ఇనుము మీద సుత్తి దెబ్బ వేసినట్టు.

"తన చిన్న కోడలేనా మాట్లాడేది? సిమెంటు కలపకుండా

కేవలం ఇసుకతోనే మేడలు కట్టిందా తను? " గందరగోళంలో పడిపోయింది — సుగుణమ్మ.

" ఏదో ఒకటి తేల్చి చెప్పమ్మా! " వినయ్ మాటలు వార్నింగ్‌లాగొచ్చినై.

రక్తమంతా కరిగి సుగుణమ్మ మొహమ్మీది కొచ్చింది. తనకు తానే బలవంతంగా శాంతించి "నువ్వలా అడిగితే ఎలారా? ఎవరికెంత ప్రాప్తముందో అంత దక్కింది." అంది _ వినయ కుమార్ చల్లబడాలని.

"ఆ మెట్ట వేదాంతం నాకక్కర లేదమ్మా!" పట్టు వదలని విక్రమార్కుడయాడు.

"నిజమే....వాడడగిందాట్లో అత్యాశేమీ లేదు. వాడికో లక్ష రూపాయలిప్పిస్తే మిగిలిన ఇద్దరు కొడుకులు సుఖంగా ఉంటారు. ఇద్దరూ కలిసి వంజేస్తే సుగుణాకర్ హత్యకేసుల్లోంచి సులువుగా బయిటపడొచ్చు. అప్పుడు తనకు మనశ్శాంతి. శేష జీవితం కృష్ణా, రామా అనుకుంటూ భగవత్సేవలో గడపొచ్చు...."తనను తాను సముదాయించుకుంది.

"ముందు సుగుణాకరన్న రానీ! వచ్చిం తర్వాత వాడి నొప్పించి నీకో లక్ష రూపాయలిప్పిస్తా!" నంది.

అసహనం గంతు లేసింది దేవకిలో.

"ఎవడబ్బ సొమ్మని ఇప్పిస్తా వత్తయ్యా? ఇక్కడ రూపాయ లేమన్నా అరబోసుకూర్చున్నారా? వినయ్‌కు లక్ష రూపాయ లెందుకివ్వాలి? ఎవరి హద్దుల్లో వారి నుంచనందుకు నిన్నా నాలి అసలు....మీరెంత అరచి గీపెట్టినా చిల్లిగవ్వ ఇచ్చేది లేదు." హుంకరిద్దామనుకున్నది కాని అది సమయం కాదని పెదవి విప్ప లేదు. కోపమంతా గొంతులో నొక్కేసి దిగ్గున లేచింది.

# 16

"సుధాకర్ హత్య కేసు పరిశోధన సరిగా జరగ లేదనీ, పోలీసులు ప్రలోభానికి లోనయారనీ గూటింపు లొస్తున్నై. సుధాకర్ భార్య మన డైరెక్టర్ జనరల్ కేదో అర్జీ పెట్టుకుందట. మీర్దేమో నిమ్మకు నీరెత్తి నట్టుంటున్నారు. మరి కొందర్ని సస్పెండు చేస్తే గాని కుదిరేట్టులేదు.

జిల్లా ఎస్పీ అగ్గిమీద గుగ్గిలమై పోతున్నాడు.

"ఏవీ....ఆ కేసు తాలూకు ఫోటోలు చూపించండి"

"శవం తాలూకు ఫోటోలు, నెగెటివ్సుగూడా దొరకలేద్సార్!" యస్సై తల వంచాడు.

"ఇద్దరు ఫోటో గ్రాఫర్లతో తీయించలేదా?"

"తీయించాం సార్! ఇద్దరు ఫోటోగ్రాఫర్లనూ ఇంటరాగేట్ చేశాం సార్!...." వివరాలు విన్నవించాడు సీ.ఐ. వినయంగా.

" మీ చెవ్వుల్లో పువ్వులు బెట్టించు కున్నారన్నమాట!" ఆ రాస్కెల్స్ఎలాగే చెబుతారు. మళ్ళీ ఇంటరాగేట్ చెయ్యండి, వారం రోజుల్లోగా విషయం తేలకపోతె సస్పెండవడం ఖాయం" చేతి కర్ర తీవిగా లేచింది.

యస్పీ వాలకానికి భయమేసిందందరికీ.

డీయస్పీ, యస్పీలు రహస్యంగా మాట్లాడుకున్నారు.

కల్లు దాగిన కోతి నిప్పులు తొక్కినట్టయింది సి.ఐ.కి. బహుశః డీయస్పీకి గూడా రహస్య సంభాషణలో అక్షింతలు పడుంటాయని చెవులు కొరుక్కున్నారు_కానిస్టేబుళ్లు.

ఇద్దరు ఫోటోగ్రాఫర్లు తిరిగి లాకప్పులో కొచ్చేశారు. టెలీఫోన్లు గొంతులు చించుకున్నా _ లెఖ్ఖ చేయలేదెవరూ, ఫోటోగ్రాఫర్లను కనికరిస్తే ఉద్యోగా లొదులుకోవాల్సి వచ్చేటట్టుందని.

ఆ రాత్రంతా దేహశుద్ధి జరిగింది.

గాలికి పోయే కంప గొంతుకు చుట్టుకుందనుకున్నారు ఫోటోగ్రాఫర్లు. ఏకీలుకాకీలు ఊడదీసి కడిగినట్టయింది.

రెండోరోజు ఇద్దరినొకే సెల్‌లో ఉంచి ప్రశ్నించారు.

మన కెందుకొచ్చిన గొడవ, ఉన్నదున్నట్టు చెప్పేద్దామనుకున్నారిద్దరూ—సైగల్తో.

"మమ్మల్నిక కొట్టొద్దు, నిజం చెప్పేస్తాం" అన్నారు.

పది నిముషాల్లో డీ.యస్పీ, సి.ఐ. లకు ఫోన్ చేసి రప్పించాడు యస్సై.

టీలు తాగించారిద్దరికీ.

"ఫోటోలు తీసిన నాడే ప్రింట్స్ వెయ్యకముందే నెగెటివ్స్ మాయమైనాయి సార్" అన్నాడు ఒక బక్క పలచని ఫోటోగ్రాఫర్ కృష్ణ—వణికి పోతూ.

"ఎలా?" గంభీరంగా ప్రశ్నించాడు సీ.ఐ.— టేప్ రికార్డర్ ఆన్ చేస్తూ.

" ఆరోజు రాత్రి ప్రింట్స్ వేద్దామనుకుంటున్నాను సార్! నలుగురితో కలిసి సురేష్‌గారొచ్చారు. నెగెటివ్స్‌తో సహా ఫోటోలిమ్మన్నాడు. ఇవ్వకుంటే స్టూడియో నామ రూపాలు లేకుండా చేస్తామన్నారు సార్!" మరణ వాంగ్మూలమిస్తున్నట్టున్నాయా మాటలు.

"భయపడి ఇచ్చేశావా?"

"లేదాసార్ బలవంతంగా అతడే లాక్కున్నాడు. వెయ్యి రూపాయలు నా చేతిలో ఉంచాడు గూడా...."ఈ ఫోటోలను పోలీసులుగూడా అడగరు. నువ్వేం భయపడకు,మన్నాడు సార్!"

"అదెట్లా సాధ్యమటా?"

"అడిగానాసార్ అదెలాగని. పోలీసులే కేసును ఆత్మహత్యగా

రాసేశారు. ఫైల్‌గూడా క్లోజై పోయింది. పోస్టు మార్టం రిపోర్టు గూడా అనుకూలంగా వచ్చేస్తుంది. ఆ వ్యవహారమంతా మేం చూసుకుంటామన్నారు. అందుకే అలా చెప్పాను సార్!" డీయస్పీ కాళ్ళను చుట్టేశాడు.

రెండోవాడు మాధవరావు- బలిష్టుడే గురుకులంలో విద్యాభ్యాసం పూర్తిచేసిన శిష్యుడు గురువు ముందు సాష్టాంగ పడినట్టు – డీయస్పీ ముందు మోకరిల్లాడు. లేచి ప్రారంభించాడు.

" ఆరోజు రాత్రి తొమ్మిదికే రీలు కడిగి ప్రింట్స్ వేశాన్సార్! స్టూడియో మూసేద్దామనుకుంటుండగా సురేష్ మరికొందరితో వచ్చి

"సుధాకర్ శవం ఫోటోలు తయారైనాయా?" అనడిగాడు.

"ఆ ఫోటోల సంగతి మీకెందుకు?" కన్నాను.

"మరి నీ కెందు"కన్నారు అర్థం లేకుండా.

"అవి పోలీసుల కివ్వాలి రేపివ్వేస్తా".

"వాటిని పోలీసులే మాకిమ్మన్నారు ఇటివ్వు,"

"అలా ఇవ్వడానికి వీల్లేదు. అవి పోలీసుల కవసరమున్నా లేక పోయినా ఫోటోలు ఫైళ్ళో ఉంచుతారు."

"వీడేదో పోలీసాఫీసరైడార్రి వెధవ!" అంటూ నా లెంపలు వాయించాడు.

స్టూడియోలో ఒక్కడినే.... భయంతో వణికిపోయాను.

"ప్రింట్స్ నెగెటివ్స్‌తో సహా ఇస్తావా! ఛస్తావా? అని కత్తి చూపించాడొకడు.

"మరి పోలీసు అడిగితే ఏం చెప్పా" అన్నాను.

"వాళ్ళడగరు, ఒకవేళ అడిగితే ఫోటోలు సరిగా రాలేదు. రీలు కాల్చేశా" ననుమన్నారు.

"ఛచ్చిన సుధాకర్ కెవ్వడూ దిక్కులేడు. నిన్నెవ్వరూ

పట్టించుకోరు. అంతా అయితే నీ వెనుక మేము లేమా?, అన్నాడు సురేష్. మొదటిసారి మీరు నన్ను పట్టుకున్నప్పుడు విడిపించింది గూడా ఆయనే సార్!"

"ఇంతకీ ఫోటోలేమైనాయి?" తాపీగా ప్రశ్నించాడు డీయస్పీ.

ప్రింట్స్, నెగెటివ్స్ సురేషే తీసికెళ్ళాడు సార్! నాకో వెయ్యి రూపాయలు గూడా ముట్టజెప్పారు. నా భార్యా పిల్లలు గుండె పగిలి ఛస్తారు .... త్వరగా వొదిలెయ్యండి సార్!" బతిమాలాడు.

స్టేటుమెంట్సు మీద ఇద్దరి సంతకాలు తీసుకున్నారు.

## 17

ఆకు ద్వారా రెమ్మను, రెమ్మ ద్వారా కొమ్మను, కొమ్మ ద్వారా కాండమును, కాండముద్వారా వేళ్ళను పట్టుకున్నట్టు.

సురేష్ తన మిత్రుని ద్వారా మరో మిత్రుణ్ని, మరో మిత్రుని ద్వారా ఎమ్మెల్యేను, ఎమ్మెల్యేద్వారా మంత్రిని చేరుకున్న తర్వాత సంబంధిత అధికారులకు ఫోన్ వెళ్ళింది. అన్ని మెట్లెక్కేసరికి డబ్బు బాగానే ఖర్చయింది.

సుగుణాకర్ వద్ద ఇంతకంటే ఎక్కువే వసూలు చెయ్యొచ్చు అనే ధీమా ఉంది సురేశ్‌కు.

మర్నాడు జిల్లా కోర్టులో బెయిల్ పిటిషన్ వేయించి సుగుణాకర్‌ను విడిపించే సరికి పలుగురాళ్ళ తోవలో చెప్పులులేకుండా పది కిలోమీటర్లు నడిచినట్టయింది. అప్పటికే సాయంత్రమైంది.

ప్రపంచాన్ని ఏకఛత్రాధిపత్యంగా పాలిస్తానన్న అలెగ్జాండర్‌లా పొంగిపోయాడు సుగుణాకర్.

సురేశ్ ఆప్త మిత్రుడే కాదు — తన పాలిటి దైవంగా కన్పించాడు.

బస్సెక్కుతూంటే ఆఫ్రికా అడవుల్లో ఆరు నెలలు తిరిగొచ్చి నట్లనిపించింది. సుగుణాకర్ కు.

బస్సులో పక్క పక్కనే కూర్చున్నారు.

"అవసరాల్లో ఆదుకున్న వాడే అసలైన మిత్రు డన్నారు. నీఋణ మెలా తీర్చుకొనగలనో!" సురేష్ చేతులు పట్టుకున్నాడు సుగుణాకర్.

"ఇంత వరకు విజయం సాధించాం.— ఇహ నీమీదున్న కేసులు కొట్టేయించుకుంటే మనం పూర్తి విజయం సాధించి నట్ట వుతుంది." అంటూ సుగుణాకర్ ను విడిపించేందుకు తానే మేమి ప్రయత్నాలు చేశాడో, ఎవరెవర్ని ఎక్కడ కలిశాడో వివరంగా చెప్పాడు సురేష్.

హైద్రాబాదులో దిగి లాడ్జింగ్ గదిలో కెళ్ళారు. బార్ లో పార్టీ జరిగింది. సినిమా కెళ్ళారు.

ఉదయం

" హైద్రాబాదులో నాకొంచం పనుంది. మనూరికి నువ్వెళ్లు.— నేను తర్వాత వస్తా " నని సుగుణాకర్ ను బస్సెక్కించాడు–సురేష్.

ఇంట్లో అడుగు పెడుతూంటే సుగుణాకర్ కు సింహం మీద సవారి చేస్తున్నట్టనిపించింది.

వినయకుమార్ ఎదురెళ్ళి

"వచ్చావా అన్నా! ఆరోజే సురేషన్నను తీసుకొచ్చాను అమ్మదగ్గరికి. అమ్మా, నేను బాగా బతిమాలాం" అన్నాడు– చిన్నగా నవ్వుతూ. ఆ నవ్వు ఎండిపోయిన వాగులా నిర్జీవంగా ఉంది.

పగలంతా మిత్రులూ, శ్రేయోభిలాషులూ, వచ్చి పలుక రిస్తున్నారు – జైత్ర యాత్రలో విజయం సాధించు కొచ్చిన

చక్రవర్తికి సామంతులు అభినందనలు తెలిపినట్టు.

అంతకుముందే — తన సెలవై పోయిందని నాగేందర్ వెళ్ళిపోయాడు.

తాబేలులా ముడుచుకుని జాలిగా చూస్తున్న సుమతితో "భారమంతా భగవంతుని మీదేసి నువ్వు నిశ్చింతగా ఉండాలమ్మా! సుధాకర్ కేవలం బెల్ మీదొచ్చాడు. నీకేమీ అపకారం తలపెట్టక పోవచ్చు. ఏది ఏమైనా నువ్వు ధైర్యంగా ఉంటేనే పిల్లలు హుషారుగా ఉంటారు." అంది తల్లి – ఒళ్ళో చేర్చుకొని తల నిమురుతూ.

"ఏం భగవంతుడోనమ్మా! ఒక్కపూట తింటే మరోపూటకు వెతుక్కునే స్థితిలో ఉన్న మా కుటుంబాన్ని, ఎక్కడో పల్లెటూర్లో ఉన్న మా కుటుంబాన్ని పట్నం తరలించి పై స్థాయికి తీసికెళ్ళిన మీ అల్లుణ్ణి నాకు దూరం చేశాడు—! జీవితంలో నాకింకేం మిగిలిందమ్మా!"అద్భుతమైన సుమతి కంటిరెప్పల్ని నీటి తెరలు కప్పేస్తున్నాయి.

సుమతి తల్లి చలించిపోయింది.

"అలా అనొద్దమ్మా! ఎవరికెంత రాసుందో అంత అనుభవించక తప్పదు. నీ నుదుట రాసిందే నీకు జరుగుతుంది. పిల్లల్ని పైకి తేవాలి. అప్పుడే నీ సుధాకర్ ఆత్మకు శాంతి నీ ఆశయం నెరవేరుతుంది కూడా! కష్ట సుఖాలు కావడి కుండల్లాంటివి. పుట్టింట్లో గారాబంగా పెరిగావు. భర్త సాన్నిహిత్యంలో సంతోషంగా గడిపావు. ఇప్పుడు కష్టాలు చుట్టుముట్టాయి. ముందు రోజుల్లో నీ కొడుకూ కూతురూ పెద్దయి నిన్ను సుఖ పెట్టవచ్చు తల్లీ!"

సుమతికి ధైర్యం చెబుతూంటే మాతృ హృదయం ఆల్లాడిపోయింది.

ఒకరికొకరు ధైర్యమై పిల్లల వైపు దృష్టి మరల్చారు.

అనుమానాల ఒత్తిడికి తట్టుకోలేక పోతుంది సుగుణమ్మ.

రాత్రి భోజనాలైం తర్వాత

"ఒరేయ్ సుగుణా! నువు పోలీస్ స్టేషన్లో గంగాధరన్ననూ, సుధాకరన్ననూ చంపానని ఒప్పుకున్నావు గదా! భగవంతుడి దయవల్ల బెయిల్‌మీద వచ్చేశావు. కాని ఇప్పుడీ హత్యా నేరాల్లోంచి ఎలా తప్పుకుంటావురా?" అడిగిందికి శ్రీ నముల్తూ.

"ఇద్దర్నీ చంపగలిగే ధైర్యం నీకెట్లా కలిగిందన్నా?–వినయకుమార్ కళ్ళు అరచేతులంత వెడల్పైనై.

దేవకి వసంతలు–ఇల్లు సర్దేస్తూ వింటున్నారు.

"ఒరేయ్ వినయ్!" చేతులు తుడుచుకుంటూ "ఆఫ్టరాల్ నేను.... నీఅన్ననే గదా! రెండు హత్యలు చేశానంటే నమ్మదగిన విషయమేనా?.... అదీ తోడబుట్టిన వాళ్ళను చంపేస్తానా?"ఎదురు ప్రశ్న వేశాడు సుగుణాకర్.

."మరి పోలీస్ స్టేషన్లో నువ్వే చెప్పావుగదన్నా....నమ్మక పోవడానికవకాశమే లేదు."

"అక్కడ దెబ్బలకు తట్టుకోలేక పోయాను. పోలీసు దెబ్బలంటే భూలోక నరకమన్నమాట. వాళ్ళకేది చెబితే చిత్రహింసలు పెట్టడం మానేస్తారో అదే చెప్పాను. అవన్నీ నిజాలా? అలా చెప్పిం తర్వాతనే నా ఒంటిమీద చెయ్యి పడలేదు తెల్సా! లేకపోతే ఈపాటికి నేను లాకప్పులోనే చచ్చిపోయేవాణ్ని."

మూతులు తిప్పి లేచిపోయింది సుగుణమ్మ.

"అది కాదన్నా!" వినయకుమార్ అనుమాన నివృత్తి జరుగలేదు. "నువ్వు చెప్పిన విషయాలన్నీ అతికినట్టే ఉన్నాయి. పత్రికల్లో గూడా వార్తలొచ్చాయి. అవన్నీ అబద్ధాలంటే ఎవరూ నమ్మేట్టు లేరు....."

"అలాగా....?"

"ఔనన్నా! ఫోటో గ్రాఫర్లను మళ్ళీ పట్టుకెళ్ళి కొట్టారట– పోలీసులు. వాళ్ళేం చెప్పారో ఏమో!"

కడుపులోని నరాల్ని కోసి పారేస్తున్నట్టనిపించింది సుగుణా కర్‌కు. పైకి మాత్రం మొహం వెలిగిపోతుంది.

"వాళ్ళనెన్ని సార్లు పట్టుకుపోయినా, ఎన్ని దెబ్బలు కొట్టినా పోలీసులకేమీ చెప్పరు. సురేశ్ తెలివి తక్కువవాడు కాదు. ఆయన సంగతి నీకింకా తెలియదురా!" పోబోయాడు.

"మరి కేసుల్లోంచి ఎలా తప్పుకోవచ్చన్నా?"

" పైనల్లోనే పరమాత్ముడున్నాడీ రోజుల్లో." కాస్సేపాగి "పోలీసు స్టేషన్లో చెప్పిందంతా నిజమని కోర్టు నమ్మదు. కోర్టుకు రుజువులు, సాక్ష్యాలు కావాలి. కళ్ళతో చూచినవారు కోర్టు కొచ్చి సాక్ష్యం చెప్పాలి. మన లాయర్ అడిగే యక్షప్రశ్నలకు, డొంక తిరుగుడు ప్రశ్నలకు జవాబివ్వాలి. అలా తట్టుకునే వారెంద రుంటారు? ఉదాహరణకు .... గంగాధరన్ననూ, సుధాకరన్ననూ చంపేప్పుడు ఎవరు చూశారు? ఎవ్వరూ చూడలేదు. ఒకవేళ ఎవ రన్నా చూచినా జిల్లా కోర్టుకొచ్చి బోనులో నిల్చునేందుకు ఇష్ట పడరు. కాబట్టి తమ్ముడూ! కేసుల విషయంలో బెంగేమీ లేదు. కాపోతే డబ్బు ఖర్చవుతుంది. అంతే .... " సునాయాసంగా చెప్పేసి తన గదిలో కెళ్ళిపోయాడు.

నిశ్చలమైన నీటిలో గులకరాయి వేసినట్టయింది వినయ్ కుమార్ మస్తిష్కం.

"హత్య చేసేప్పుడు ప్రత్యక్షంగా చూచిన మనిషి జిల్లా కోర్టుకెళ్ళి.... బోనులో నిల్చుండి — లాయర్ అడిగే తిక మక ప్రశ్నలకు తట్టుకోవాలా? హత్య చేసేవాడు ఎవరి ముందైనా చేస్తాడా? ఎవడైనా చూచి సాక్ష్యం చెబుతానని ముందు కొస్తే

వాని నోరు డబ్బుతో మూయించరాదా?— హత్యంటే ఓస్.... అంతేనా?" ఆలోచనలు సుడులు తిరిగి నవ్వుకున్నాయి.

సుగుణమ్మకు నిద్ర రావడంలేదు. బలవంతాన కళ్ళు మూసుకుంది. కాటుక ముద్దల్లాంటి చీకటి కెరటాలు ఉవ్వెత్తున లేచి తనను ముంచేసేందుకు పరుగెత్తుకొస్తున్నాయి. అదృష్య శక్తి ఏదో గొంతెత్తి ప్రశ్నిస్తుంది.

"సుగుణాకర్ హత్యలు చేయలేదంటే ఎవరైనా నమ్ముతారా?

అరగంటలో సుధాకర్ కాలి చచ్చాడా? అరగంట కాలితే ఆ రోజులైనా బతకాలి గదా!

నిజంగా మంటల్లో చిక్కుకుని చస్తే కార్డు బోర్డు పూజాగది ఎందుకు అంటుకోలేదు?.

గంగాధరం సంగతి అంతా తెలిసి గూడా మౌన వ్రత మెందుకు పాటిస్తున్నట్టు? అతడు సవతి కొడుకైనంత మాత్రాన ఆ పాపంలో నీకు భాగం లేదా?

చేసిన పాపాలు కేవలం యాత్రల కెళ్ళొస్తే తుడుచుకు పోతాయా? మనసు మారొద్దూ?

నిజంగా వినయ్‌కుమార్‌కు అన్యాయం జరుగలేదా?

సుధాకర్ తెలివి తేటల్తో కష్టపడి కుటుంబాన్ని పైకి తెచ్చినందు కతనికి లభించిన సత్కారమిదేనా? అతని భార్యను అనవసరంగా అనుమానించి సాధించడం న్యాయమా? అతని పిల్లలు బిక్కు బిక్కు మంటూ పెరగాల్సిందేనా? వాళ్లు నీ వంశా నికి పుట్టినవారు కాదా?

సుమతి మీద ఇంకా ద్వేష భావమెందుకూ? హత్యచేసింది సుగుణాకరని తేలిం తర్వాత—సుమతి నిర్దోషియని తేలలేదా?"

గోడగడియారం లోలకంలా కొట్టుకుంటుంది గుండె. గుండె చప్పుళ్ళు ఒళ్ళంతా చెమటలు పట్టిస్తున్నాయి.

ఏదో చెయ్యాలి. విషపూరితమైన గతం అనుభవాలు— కేవలం ఇసుకతో గోడలు కట్టలేమని చెబుతున్నాయి. గతం నుంచి గుణపాఠం నేర్చుకు తీరాలి. ఇకముందైనా కొడుకుల్ని సరియైన మార్గంలో నడిపించాలి. తల్లిగా తన కర్తవ్యం నెర వేర్చాలి—నెర వేర్చాలి.

గుండెల్లో ఉద్భవించిన పాలి కేక పెదవుల మాటున మెలికలు తిరిగిపోతుంది.

ఒంటి చెమటతో గుడ్డలు తడిసినై.

దక్షిణ యాత్రల ఫలితం దక్కాలంటే ఉత్తర యాత్రలు చెయ్యాలి. ఉత్తర యాత్రలు చెయ్యాలంటే సుగుణాకర్, వినయ్‌కుమార్ ల మధ్య సఖ్యత కుదిరితేనే వీలవుతుంది. వారి సఖ్యతకు తక్షణం ఉద్యమించాలి. తనవంతు పాత్ర నిర్వహించాలి.... లేచి కూచుంది.

## 18

"నీ ఆస్తిలోంచి భాగమిచ్చి తీరాలన్నా!" అని ఎంత బతిమాలినా, కాళ్ళు మొక్కినా వినలేదు—సుగుణాకర్.

"కనీసం ఒక లక్ష రూపాయలన్నా ఇవ్వు" అన్నాడు. గట్టిగా తన్నేశాడు. చంపేస్తానని కత్తి ఎత్తాడు.

నిద్రలోంచి ఠకీమని లేచి కూచున్నాడు వినయకుమార్. "అది పీడ కల గదా!" ధైర్యమొచ్చింది.

గోడ గడియారం నాల్గు కొట్టింది—గట్టిగా. తెల్లవారేందుకింకా రెండు గంటలుంది.

పడకగది బాత్రూం వైపె వెళ్ళబోయాడు. పెరట్లో లైటు వెలుగుతుంది. ఆశ్చర్యమేసింది.

ఏవో మాటలు వినబడుతున్నాయి. ద్వారం ప్రక్కన నిలబడిపోయాడు.

"ఈ పనికిరాని మాటలకే మంచి నిద్ర చెడగొట్టావమ్మా?" విసుక్కున్నాడు – సుగుణాకర్–కళ్లు నులుముకుంటూ.

"నిన్ను నిద్ర లేపడం లేదు. నాకు నిద్రే రావడంలేదు" అంది సుగుణమ్మ.

"ఎందుకమ్మా!" ఆవలించాడు.

"గంగాధరన్న సంగతి తెలిసిందే గాని—సుధాకరన్నను నువ్వే చంపావని నా అంతరాత్మ చెబుతుందిరా!"

సుగుణాకర్ నిద్రమత్తు వదిలింది.

"ఐతే ఇప్పుడేమంటావమ్మా?" సీరియస్‌గా అడిగాడు.

వెన్నెలకు లైటు వెలుగు తోడైంది. సుగుణమ్మ కళ్ళు తడిసిపోవడం స్పష్టంగా కన్పిస్తుంది.

"అంత పాపానికెలా ఒడిగట్టావురా?"

"పాపమో, పుణ్యమో జరిగిందేదో జరిగిందిగదమ్మా"

కొంగుతో కళ్ళద్దుకుంది–సుగుణమ్మ.

"నువ్వలా ఏడుస్తూ కూచుంటే ఏం లాభం చెప్పమ్మా?"

"నిజమే .... కాని నాది కన్నకడుపురా!" బోరు మనాలన్పించింది–ఆపుకుంది.

"ఐతే నన్నుగూడా నువ్వే కన్నావుగదా!"

"నిన్నే కాదు, వినయ్‌ని గూడా నేనే కన్నాను. మిగిలిన మీరిద్దరూ క్షేమంగా, సుఖంగా ఉంటే నాకు మనశ్శాంతి."

సుగుణాకర్‌లోని ప్రకంపనాలు తగ్గు ముఖం పట్టాయి.

"దానికి నన్నేం జెయ్యమంటావమ్మా!"

"నువ్వూ, వినయ్ ఇద్దరూ ఒకే హోదాలో ఉండాలి. వాడికి వ్యవసాయం అచ్చిరావడం లేదట. ఇక్కడేవుండి ఏదన్నా వ్యాపారం చేసుకుంటానన్నాడు. చేతిలో చిల్లిగవ్వ లేదటా్ర..."

ఏదో అనుమానం పొడసూపింది.

"ఐతే నన్నేం జెయ్యమంటావ్?"

"నీకి పట్నంలో సొంతిల్లు, దుకాణం ఉన్నై. కోళ్ళఫారం ఫైనాన్స్ కంపెనీల్లో భాగస్వామ్యముంది వడ్డీ వ్యాపారం గూడా నడుస్తుంది... "

"అదంతా నా స్వయం కృషి గదమ్మా! వాటి కొరకెన్ని రోజులు శ్రమించాను...."

దయ్యాలు వేదాలు వల్లె వేసినట్టనిపించింది సుగుణమ్మకు. దుఃఖం కరిగి కోప రూపం దాల్చింది.

" కాదు! " విపరీత శక్తుల మీద దాడి చేస్తున్న కథా నాయకురాలైంది. "సుధాకరన్నను మోసంచేసి సంపాదించావు. త్యాగమంతా సుధాకరన్నది, భోగమంతా నీది. గంగాధరన్న డబ్బుగూడా నీ దగ్గరే వుండిపోయింది." గద్దరించింది.

ముప్పై కిలోవాట్ల కరెంటు షాక్ కొట్టినట్టనిపించింది సుగుణాకర్‌కు. నరాలను పర పర కోస్తున్నట్టనిపించింది, తల్లి మీద కోపం, అసహ్యం ముంచుకొచ్చినై.

"ఐతే.... ఏందటా?"

" ఏమీ లేదు. వినయ్‌కో రెండు లక్షల రూపాయ లివ్వు. లేదా వాడి ఆస్తి, నీ ఆస్తి, కలిపి పంచుకోండి. మీరిద్దరూ నా కిప్పుడు రెండు కళ్ళు. ఎవరికి కష్టం కలిగినా భరించలేను."

కంటిలో కారం చల్లి కీళ్ళమీద రూళ్ళ కఱ్ఱతో కొట్టి నట్టని పించింది—సుగుణాకర్‌కు.

రెండు లక్షలా—లక్షలంటే ఏమనుకున్నావమ్మా!"

"వాటి విలువ నాకు తెలువదనుకోకు. మర్యాదగా ఇచ్చి పరువు నిలుపుకో." ఆదేశంలా దూసుకొస్తున్నాయి మాటలు.

"రెండు లక్షలు కాదుగదా, రెండువందల రూపాయలు గూడా ఇవ్వను. నా డబ్బు వానికెందుకివ్వాలి. ఎవరదృష్టం వారిది.

"అలాగంటే కుదరదు. పోనీ— ఓ లక్షన్న రివ్వు. నీ వెంట విశ్వాసంగల కుక్కలాగుంటాడు. నీకెలాగంటే అలా సహాయం చేస్తాడు."

"నామీద ఎందుకింత పగబట్టావమ్మా? ఓవైపు హత్యకేసుల్లో ఇరికి డబ్బులు కుమ్మరిస్తున్నాను." పిడికిళ్ళు అనుకోకుండా బిగుసుకు పోతున్నై.

సుగుణమ్మ అంతరాళాల్లో అతీత శక్తులేవో విశ్వరూపం దాల్చాయి.

"ఒరేయ్! నువు చేసిన తప్పులన్నీ నాకు బాగా తెలుసు. నువ్వెంత లోతు నీళ్ళల్లో ఉన్నావో తెలుసు. ఎలా ఒడ్డుకు చేరు కుంటావో గూడా తెలుసు. చివరిసారిగా చెబుతున్నా.... ఓ లక్ష రూపాయలివ్వు. వాడదృష్టాన్ని పరీక్షించుకుంటాడు."

సుగుణాకర్‌కు చిర్రెత్తింది.

"ఇవ్వలేనమ్మా...."

"పోనీ నా లక్ష రూపాయలు వాడికిచ్చెయ్...నాగతి ఎలా ఉంటే అలా జరుగుతుంది."

"అవిమాత్రం వాని సొంత డబ్బా? అసలొక్క రూపాయి గూడా ఇవ్వను."

"ఇచ్చి తీరాలి."

"ఇవ్వకుంటే ఏంజేస్తావ్?" చెట్టుకింది రాయిమీద కూచున్న వాడల్లా దిగ్గున లేచాడు.

"ఏంజేస్తానో... నీకు చెప్పి చేస్తానా? నేంజెప్పినట్టు చెయ్యక పోతే చెడిపోతావ్‌రా!"

బాత్రూం కొరిగిన సుగుణమ్మ జరిగి నిటారుగా నిల్చుంది.

"ఐతే నా రహస్యాలన్నీ తెలుసని ఏదో చేద్దామను కుంటు న్నావే ముసలిముండా!" ముందు కురికొచ్చాడు. సుగుణమ్మ

గొంతు సుగుణాకర్ చేతుల్లోకొచ్చింది.

మొక్కుతున్న గుడి విరిగినట్టుంది సుగుణమ్మకు.

"ఒరేయ్... నన్ను గుడా చంపుతావా? ఆఁ ఆఁ" విడిపించు కునేందుకు గింజుకుంటుంది.

"ఔను— నా ఆయువు పట్లన్నీ నీ చేతిలున్నై. చూడ బోతే నువ్వే నాకు వ్యతిరేకంగా కోర్టులో సాక్ష్యమిచ్చేట్టుంది. నువ్వొక్కదాని వీ లోకంలో లేకపోతే నా పీడా వదిలిపోతుంది. చావ్

సుగుణాకర్ చేతులు బిగుసుకు పోతున్నై. గొంతులోంచి మాట పెగలడం లేదు. విడిపించుకునేందుకు సుగుణమ్మకు శక్తి చాలడం లేదు.

వినయకుమార్ పళ్లు పట పట లాడినై. రక్తం సల సల కాగుతుంది. మహోగ్రమైన మొహం ఎర్రమందారమైంది. కళ్ళూ, కాళ్ళూ, చేతులూ దేనికోసమో వెతుకు తున్నాయి.

సుగుణమ్మ పెనుగులాడుతుంది. సుగుణాకర్‌లో పట్టుదల రెట్టింపైంది.

వెనకనుండి ... సుగుణాకర్ తలమీద దుడ్డు కర్ర దెబ్బ బలంగా పడింది. "అబ్బా అంటూ అరచి తల్లిగొంతు వదిలేశాడు.

వినయకుమార్... తనకంటే చిన్నవాడైన వినయకుమార్ —చేతిలో దుడ్డు కర్ర. అదే దుడ్డు కర్ర... తాను సుధాకర్ కోసం ఉపయోగించిన దుడ్డు కర్ర... ఎక్కడ దొరికింది వీడికి?

అపర వీరభద్రుడిలాగున్నాడు. వినయకుమార్. కర్ర గుంజుకునే ప్రయత్నం చేసేలోగా ముందటి నుండి మరో దెబ్బ పడింది,

"ఇద్దరన్నల్ని చంపావు. ఇప్పుడమ్మను చంపుతున్నావు. రేపు నన్నుగూడా చంపుతావురా దుర్మార్గుడా" ఊగిపోతున్న

వినయకుమార్ చేతి కర్ర దెబ్బ మరోటి తగిలించింది.

మూడో దెబ్బకు కుప్పకూలిపోయాడు సుగుణాకర్. తల కొబ్బరికాయలా పగిలింది. రక్తం— రక్తం....రక్తంతో తడిసిన పెరటి నేల.

చిమ్మిన రక్తం వినయకుమార్ బట్టల్ని తడిపేసింది.

"ఒరేయ్ వినయ్!" సుగుణమ్మ పరుగెత్తుకొచ్చి– వినయకుమార్ చేతుల్లోంచి దుడ్డు కర్ర లాక్కుంది.

ఒడ్డు కేసిన చేప పిల్లలా కొట్టుకుంటున్నాడు సుగుణాకర్. పెదవులు అస్పష్టంగా కదుల్తున్నై.

" నా....పాపానికి... ప్రా....య... శ్చి... త్తం దొరికిం.. దమ్మా!"

పెదాలాగిపోయినై.

కదలిక ఆగిపోయింది.

జనారణ్యంలో ఎవ్వరికీ జవాబుదారు కానను కున్న సుగుణాకర్ శరీరమనే పంజరంలోంచి ప్రాణమనే పక్షి ఎగిరిపోయింది.

"'ఎంత పం జరిగిపోయింది .... భగవాన్! " మొదలు నరికిన చెట్టులా పడిపోయింది సుగుణమ్మ.

దుడ్డు కర్రనూ, ఒంటిమీది రక్తాన్ని బాత్రూంలో కడుక్కుంటున్నాడు వినయ్‌కుమార్.

శుభం

